అమ్మ

కె. వేంకట రామకృష్ణ

ప్రథమ ముద్రణ : దుర్గా నవరాత్రులు, 2010

ప్రతులు : 1,000

వెల : రూ॥ 60/-

ప్రతులకు
అమ్మ, వినయ్
11-2-111/3, సీతాఫల్‌మండి, సికింద్రాబాద్-500061
ఫోన్: 9949800801
మరియు విశాలాంధ్ర బుక్‌హౌస్, హైదరాబాద్

కవర్ పేజీ : **శ్రీ బాపు గారు**

ముద్రణ :
**ప్లానో గ్రాఫర్స్,**
చిరాగ్ అలీ లేన్, హైదరాబాద్ - 500001
ఫోన్: 23203390, 66103390

# కృతజ్ఞతలు

- ఇప్పటిదాకా అన్నిటికీ మా అమ్మకీ,
- అద్భుతమైన చిత్రం గీసిచ్చిన శ్రీ బాపూ గారికీ,
- అడగగానే అమ్మ చిత్రాలు గీసిచ్చిన శ్రీ మోహన్ గారికీ, ఇతర ఆర్టిస్టులందరికీ,
- ముందుమాట వ్రాసిచ్చిన శ్రీ సౌభాగ్య గారికీ,
- చక్కటి ఆశీర్వచనం ఇచ్చిన శ్రీ తనికెళ్ళ భరణి గారికీ,
- బాపూ గారిని పరిచయం చేసిన శ్రీ బ్నిం గారికీ,
- మంచి సూచనలిచ్చిన మిత్రుడు శ్రీ తనికెళ్ళ శంకర్‌కీ,
- ఆర్థిక సహాయం చేసిన సోదరి శ్రీమతి సాయి జయశ్రీ గారికీ,
- ఇలా వ్రాసుకుంటూ జీవించే అవకాశం కలిగించిన నా శ్రీమతి జయశ్రీకి,
- తమ సంస్థలో నాకు పనిచేసే అవకాశం ఇచ్చిన శ్రీ పిల్లుట్ల విశ్వనాథ్ గారికీ, శ్రీ మాణిక్ దారువాలా గారికీ,
- ప్రతి కవిత చదివి తగు సూచనలిచ్చిన శ్రీ లాలా కృష్ణమోహన్, శ్రీ రాఘవేంద్రరావు, శ్రీ శశికుమార్ గార్లకీ,
- శ్రీమతి & శ్రీ సర్వేష్ గారికీ,
- ప్లానో గ్రాఫర్స్ వారికీ,
- మీ అందరికీ

# మనవి

ఈ కవితా రచనకు సమాజంలో నేను చూసిన విభిన్న వ్యక్తులు, కుటుంబాలు, సంఘటనలు స్ఫూర్తి. కవితలన్నీ ఒక్కరిద్దరు వ్యక్తుల గురించి వ్రాసినవి కావు కాబట్టి, ప్రతి కవితనీ విడిగా చదువుకోవాలని మనవి.

సాధారణంగా కవితలు అనగానే ఛందస్సులూ, మాత్రలు గుర్తుకురావడం కద్దు. అయితే మాకు, మీకు అందరికీ ఈ అపురూపమైన మానవజన్మను ప్రసాదించిన తల్లిని మనస్సుకి నచ్చినట్లుగా వర్ణించుకోవడానికి, స్తుతించుకోవడానికి ఏ ఛందస్సులు, మాత్రలు, గణాలు అవసరం లేదనిపించింది. నిజానికి నాకవి తెలియవు కూడా! ఛందోబద్ధ రచనకు ప్రాధాన్యం ఇచ్చే కవివర్యులు, భాషాకోవిదులు ఆ కోణం నుండి ఈ రచనను చూడవద్దని నా వేడుకోలు.

జగమంత కుటుంబానికి జీవం పోసే 'అమ్మ'ని నా మనసారా తోచిన విధంగా, తెలిసిన పదాలలో పదబంధాలలో స్మరించుకున్నాను...

నిజం సుమీ... అనుకుంటే 'అమ్మ' కవితలను ఆస్వాదించండి...

తప్పులుంటే మన్నించండి...

ఒప్పులుంటే ఆశీర్వదించండి...

భవదీయుడు

వేంకట రామకృష్ణ



శ్రీశ్రీశ్రీ శివతేజ స్వామి వారి ఆశీస్సులతో రచించిన ఈ కృతి

నను గన్న మాయమ్మ శ్రీమతి పద్మజాదేవికీ,

గురుమాత శ్రీమతి ప్రఫుల్లాదేవికీ,

శ్రీశ్రీ ఈశ్వరాంబా మాతకీ,

మిముగన్న మీయమ్మ గారికీ

అందరినీ గన్న

**జగన్మాతకి**

**అంకితం**

# అమ్మ విశ్వరూపం

'ఢిల్లీకి రాజైనా తల్లికి బిడ్డే' అని ఒక సామెత. తల్లికి ఎందరో కవులు పుస్తకాలు అంకితమిచ్చారు. కవితలు రాశారు. అమ్మ మీద విభిన్న కవుల సంకలనం వచ్చింది. కానీ అమ్మను విభిన్న కోణాల్లో దర్శించి ఆ సమగ్ర మూర్తిని ఆవిష్కరించిన కావ్యం ఇప్పటిదాకా తెలుగులో రాలేదనుకుంటాను.

రామకృష్ణ అమ్మని అపూర్వంగా ఆవిష్కరించారు. మాతృమూర్తి మమకారాన్ని మనందరికీ పంచారు. స్త్రీ పుట్టినిల్లు, మెట్టినిల్లు, పెళ్ళి, కుటుంబం, తల్లి కావడం, పిల్లలు, ఇల్లు, ఉద్యోగం, సమాజం వీటన్నిటి గుండా ఆమె గమనంలోని మూర్తిమత్వాన్ని గంభీరంగా ఆవిష్కరించారు. ఈ కుటుంబవ్యవస్థలో త్యాగమొక్కటే తెలిసిన ఆమె మమకారస్వరూపాన్ని మనకందించారు.

అమ్మ ఔన్నత్యం

విశ్వమంతా ఆస్వాదించే సుగంధం అమ్మ ఒక్కటే

ప్రపంచమంతా ఆమోదించే సౌందర్యం అమ్మ ఒక్కటే

సామ్రాట్టులు కూడా తలవంచే సార్వభౌమత్వం అమ్మ ఒక్కటే

సన్యాసులు కూడా వీడలేని బాంధవ్యం అమ్మ ఒక్కటే అన్న అపూర్వ కవితతో అద్భుతంగా కొనసాగుతుంది. బైరన్, బాల్జాక్ వంటి కొంతమందికి తల్లిప్రేమ దొరక్కపోయి వుండవచ్చు. ఈ ప్రపంచం తల్లి మమకారంలో మాత్రమే వునికిలో వుందన్న సత్యాన్ని రామకృష్ణ బహుముఖాలుగా ప్రదర్శించారు. 'సన్యాసులు కూడా వీడలేని బాంధవ్యం అమ్మ ఒక్కటే' అని రామకృష్ణ గారంటే మనం ఆశ్చర్యపోతాం. కానీ అది నిజం. 'నిన్ను నువ్వు తెలుసుకో' అన్న నిజాన్ని చాటిన రమణమహర్షికి తన తల్లి అంటే మమకారం. ఆ సర్వసంగపరిత్యాగి తన తల్లికి గుడి కట్టించి సేవలు చేసేవాడు.



పుట్టిల్లుతో అమ్మ అనుబంధాన్ని

'కన్నతండ్రి కంటిపాప

కన్నతల్లి గుండెశ్వాస

అన్నదమ్ముల కంటివెలుగు

అమ్మ తన పుట్టింటివారి ఇంటి వెలుగు' అని కళ్ళకు కట్టించాడు. పెళ్ళయిన తరువాత భర్తతో ఆమె పడే బాధలు, ఎన్ని బాధలు పడినా ఒదిగి వుండడం, పిల్లల కోసం జీవితాన్ని అంకితం చెయ్యడం వంటి సందర్భాలను ఉద్వేగంతో వర్ణించుకుంటూపోతాడు. తల్లి మన కడుపు నిండేట్లు ప్రేమగా తినిపిస్తుంది. ఆ తల్లిని అట్లా మనం సంతృప్తిపరచలేమంటాడు.

'అమ్మ పెట్టినట్లుగా తృప్తిగా భోజనం

అమ్మకి పెట్టగలిగిన కొడుకింకా పుట్టలేదు' అంటాడు రామకృష్ణ.

తల్లిని మించిన దైవం లేదన్నారు. ఆ దైవాన్ని కీర్తించిన రామకృష్ణ ధన్యజీవి. తల్లిపై తరంగాలుగా తరలివచ్చిన ఈ తన్మయగీతాల గురించి

'మీనాక్షి మమతలో మునిగేటి మనస్సు నాది

దాక్షాయణి దయతో లభించిన తనువు నాది

కామాక్షి కరుణతో కదిలేటి కలము నాది

కాత్యాయని పాదాలను స్పృశించిన కావ్యము నాది ' అని చెప్పుకున్నాడు.

పోతన గారిలా 'తల్లీ! నిన్ను దలంచి' అని చెప్పుకున్నాడు. మాతృమూర్తి ద్వారా ప్రేమించడం నేర్చుకున్న ఈ భావుకుడు కళ్ళకు కనిపించిన ప్రతి స్త్రీ మూర్తిలో, భూమాతలో, దేశమాతలో, ప్రకృతిమాతలో అమ్మను అపూర్వంగా దర్శించే ధన్యుడు. అతని మాతృ మమకారానికి మనల్నందరినీ తలలు వంచేలా చేసే తపస్సు.

సౌభాగ్య

# విషయసూచిక







# అమ్మ ప్రార్థన

1. శ్రీమాతవు నీవు మాకు, నీ పదముల మ్రొక్కెదము
రూపమొసగి, ప్రాణమొసగి, నరజన్మను ఇచ్చినావు
నీ కటాక్ష వీక్షణలతో మా జీవన యాత్ర సాగ
నీ సన్నిధి చేరనిమ్ము, కరుణామయి పావనీ!

2. సత్యలోక శోభనీవె శుద్ధసత్వ భారతీ
వైకుంఠము నందు నీవె, నీరజాక్షి కోమలీ
కైలాసము నీ విలాసము శక్తి ధాత్రి పార్వతీ
నీవు లేక శివుడు సగము, సగము బ్రహ్మవిష్ణువూ

3. ఋగ్వేదము నీవె కదా, నీవె సామగానము
అధర్వణము నీవె మాత, నీవె యజుర్వేదము
నీవె స్మృతుల సారము, నీవె బ్రహ్మసూత్రము
ఇతిహాస నాయకి నీవె, నీవె చిద్విలాసినీ

4. సృజన నీదె, స్థితియు నీవె, నీవె లయకారిణీ
జపము నీకె, తపము నీకె, నీవె సిద్ధిప్రదాత్రివి
బుద్ధి నీవె, జ్ఞానమీవె, నీవె మాత భారతీ
సుఖము నీవె, సంపదీవె నీవె చంద్ర సోదరీ

5. నీవె మాకు ఆధారము, నీవె మాకు ప్రాణశక్తి
నీవె కదా అన్నపూర్ణ, నీవె లోన జఠరాగ్నివి
నీవె గ్రంథి విభేధినివి, నీవె శ్రీచక్ర సంచారిణివి
నీవె మాయ, నీవె తెరవి, నీవె సత్ స్వరూపిణివి

6 నీ అందెల రవళులన్ని మా వీనుల మ్రోగనిమ్ము
నీ పదముల రజములన్ని మా శిరముల నిలువనిమ్ము
శ్రీ గంధపు పరిమళాలు మా బ్రతుకుల నిండనిమ్ము
నీ చల్లని దీవెనతో మా తపములు పండనిమ్ము

# అమ్మ

1. విశ్వమంతా ఆస్వాదించే సుగంధం అమ్మ ఒక్కటే
ప్రపంచమంతా ఆమోదించే సౌందర్యం అమ్మ ఒక్కటే
సామ్రాట్టులు కూడా తలవంచే సార్వభౌమత్వం అమ్మ ఒక్కటే
సన్యాసులు కూడా వీడలేని బాంధవ్యం అమ్మ ఒక్కటే

2. అమ్మ లేని ప్రపంచం
చెట్టు లేని భూతలం
ఆమె లేని కుటుంబం
ఆత్మ లేని శరీరం

3. కంట మెరిసిన మొదటి వెలుగు అమ్మ
నోట పలికిన మొదటి మాట అమ్మ
గుండె నిండిన మొదటి మధురిమ అమ్మ
చివరి ఘడియన ఆర్తనాదం ' అమ్మ '

4. బ్రతుకు బడిలో మొదటి గురువు
తేనె మమతకి మొదటి నెలవు
బ్రతుకు బాటలో మొదటి నేస్తం
బ్రతుకు తోటలో మధుర చైత్రం

5. నాకు ' చంద'మామెలా అవుతాడు?
చంద్రుడు అమ్మకి వరుసకి అన్న
ఆ అన్నకి చెల్లికదా మా అమ్మ
అందుకే ఆమె మనస్సు వెన్నెలవెన్న




చిత్రం : కుమారి ప్రవల్లిక

6. ఒకడు పొడవెంతని అడుగుతాడు
మరొకడు తెలివెంతని ప్రశ్నలు వేస్తాడు
ఒకటి జేబు బరువు తూస్తుంది
అమ్మ ఒక్కతే పొట్టలోతు కొలుస్తుంది

7. కలువరేకు సాక్షిగా అమ్మ విశాలాక్షి
తండ్రి రాకకై ఎదురు చూచి చూచి
బిడ్డల రాకకోసం దారి కాచి కాచి
కళ్ళింతలు చేసుకునే అమ్మ విశాలాక్షి

8. కమలంపువ్వు సాక్షిగా అమ్మ మహాలక్ష్మి
నుదుటన కుంకుమతిలకం, కర కంకణ నిక్వాణం
అందెల రవళులు, కన్నుల వెన్నెల కాంతులు
అమ్మ బంగరు కాసుల వర్షం కురిపించగల వైభవలక్ష్మి

9. అమ్మ కోసమే భూగోళం తిరుగుతుంది
అమ్మ రూపమే ప్రకృతి తానుగా ధరిస్తుంది
అమ్మ పూజకి పర్జన్యం కురుస్తుంది
అమ్మ నోముకే మాంగల్యం నిలుస్తుంది.

10. మేధస్సు బాధ్యతనే బేరీజు వేస్తే
కన్నులు ప్రేమ సౌందర్యం చూస్తే
ప్రతిరోజూ అమ్మే విశ్వసుందరి
అమ్మ నీడలో విశ్వం చల్లని పందిరి

11. మనిషి తనకు తానుగా పోషించే భావన ద్వేషం
ఒకడైతే చేయవచ్చు రాక్షస సంహారం
ఇప్పుడు మార్గమొకటే; వ్యాపించాలి ప్రేమ సందేశం
దైవం తనకు తానుగా వస్తాడు భువిపైకి, వేసి అమ్మ వేషం

12. దేవుడైనా సరే ధరణిలో పుడితే
అమ్మ కడుపునే పుట్టాలి
రాముడైనా సరే పుడమిపై అడుగిడితే
అమ్మ ఒడిలోనే పెరగాలి.

13. హరివిల్లు చేతికందని చిత్రం
విరిజల్లు ఊహకందే విచిత్రం
వింటి అందం, జల్లు చందం
అమ్మ ఒక అద్భుతం

14. బాపూ నుదుటన
అమ్మ కస్తూరీ తిలకం
నరేంద్రుని బ్రతుకున
అమ్మ వివేకానందం

15. పలికితేనే పెదవులు కలిపే శబ్దం అమ్మ
మనస్సు విప్పితేనే పూర్తిగా తెలిసే అర్థం అమ్మ
హృదయంతోనే చదివే కావ్యం అమ్మ
దేవుడు ప్రేమకి చెప్పిన భాష్యం అమ్మ



16. అమ్మ ప్రేమ పొందేవాడు ధన్యజీవి
అమ్మ వుంటే చాలు, బ్రతుకులో రీవి
ఒక్క అమ్మకే ఇంతగా గర్విస్తే మనిషి
అందర్నీ అమ్మలుగా భావించేవాడే మనీషి

17. పలికితేనే చాలు తేనెలొలికే మాట
తలచితేనే చాలు మమతలూరే ఊట
మెదిలితేనే చాలు మనసులో అమ్మ
గుండె ఇక మమతానురాగాల చెమ్మ

18. పరబ్రహ్మ చెప్పిన పనులు చేసే శక్తులు
మనుషుల దృష్టిలో దేవతలు
ఆ శ్రేణిలో చేరిన వ్యక్తులు తల్లులు
అందుకే మనకి అమ్మలు వేల్పులు

19. మన సంస్కృతి కాపాడే గ్రంథం అమ్మ
మన కళలను దాచిన అందం అమ్మ
తెలుగు తేనెలు చిలికించే పలుకే అమ్మ
గానసుధలు కురిపించే అమృతవర్షిణి అమ్మ

20. విజయాల్లో, వైఫల్యాల్లో
తారుమారు శత్రువులూ, స్నేహితులూ
సిరిసంపదల్లో, ఆపదల్లో
ఒకే మోతాదులో అమ్మ ప్రేమలు

21. ఎన్ని కన్నీళ్ళు కారిస్తే తడుస్తుంది అమ్మ పాదయుగళం
కనీసం వందేళ్ళు లిఖిస్తే నిండుతుంది అమ్మ నామకోటి -కోటి
ఎన్ని సద్బుద్ధులు కలిగితే, పుడుతుంది అమ్మ పట్ల భక్తి
ఎన్ని తపస్సులు చేస్తే, తెలుస్తుంది అమ్మలోని ప్రేమశక్తి

22. వండి వారుస్తూ అమ్మ, వడ్డిస్తూ అమ్మ
నలుగురి కడుపులు నింపేస్తూ అమ్మ,
మాలిన్యం తొలగిస్తూ, పరిశుభ్రత నారేస్తూ
ప్రతిరోజూ వేయి చేతుల్తో అమ్మ

23. బిడ్డల క్షేమం తప్ప దేశ సరిహద్దులెరుగని అమ్మ
దేశం, ప్రాంతం, రంగూ రూపూ ఏదైనా
ప్రతి బిడ్డ అమ్మ కంటికి బిడ్డడే కదా!
ఎల్లలెరుగని అమ్మ ప్రపంచానికే అమ్మ కదా!

24. అమ్మ తన గర్భంలో, గుండెల్లో
తన మనస్సులో నిన్నే మోస్తుంది
ఇలా దేవుడొక్కడే మోయగలడు నిన్ను
అందుకే దేవుడికిష్టం అమ్మ కడుపున పుట్టడం

25. పాపపుణ్యాల లెక్కలు వేయని సీమ
తప్పొప్పులు బేరీజు వేయని ప్రేమ
చీకుచింతలు తెలియనివ్వని జోల
అమ్మ ఒడిన బిడ్డల ఆనంద హేల



# 1. అమ్మ - పుట్టినిల్లు

1. కన్న తండ్రికి కంటిపాప
కన్న తల్లికి గుండె శ్వాస
అన్నదమ్ముల కంటి వెలుగు
అమ్మ తన పుట్టింటి పరువు

2. మీసముంటేనే కొడుకులా?
తన తండ్రి బాధ్యత మోస్తూ కొడుకులా,
నట్టింట తిరిగేను దివ్య రూపమై
అమ్మ తన పుట్టింట వెలిగింది మణిదీపమై

3. అమ్మ పుట్టింది వాళ్ళమ్మ ఇంటిలోన
తన నాన్న విరిచాడు తన పెదవి, నీరసంగా,
తాతమ్మ మురిసింది వచ్చింది లక్ష్మి అంటూ,
అమ్మకే తెలుసు అమ్మ విలువ, నాన్న కంటె.

4. అమ్మ పెరుగుతుంటే తాతయ్య మనస్సు కరుగుతుంది
ఆమె దీపమై వెలుగుతుంటే తనకు జ్ఞానం కలుగుతుంది
నట్టింట తిరుగుతుంటేను అతని మనసు ఉప్పొంగిపోతుంది
ఆడపిల్లపై అమ్మకంటే నాన్న ప్రేమ ఎక్కువై పొంగిపొరలుతుంది.

5. అమ్మ పుట్టినింట్లో శ్రీలక్ష్మి వెలసేను
అమ్మ చిరునవ్వులకే ధనలక్ష్మి మెరిసేను
అమ్మ నడయాడితేనే ధాన్యాలు కురిసేను
అమ్మ సౌభాగ్యలక్ష్మి, తల్లిదండ్రుల కలలు పండేను

6. పెళ్ళిచూపులనాడు కొయ్యవీణలా కూర్చుంది
నలుగురూ మెచ్చగా వేణువై మ్రోగింది
కళ్ళు రెండూ నిండుసంద్రాలుకాగా,
గుండెలరుపును పెంచి, పుట్టింటికే అమ్మ వీడ్కోలు పలికింది



# 2. అమ్మ - మెట్టినిల్లు

1. కోయిల వసంతంలో వాలినట్లుగా
అమ్మ మెట్టినింట్లోకి చేరుతుంది
అత్తింట్లో మమతానురాగాలు చిగురిస్తే
ఆలపించదా అమ్మ తీయగా శ్రీరాగం?

2. అమ్మ తన పుట్టింటివారు వెలిగించిన దీపం
గాలివాటుకు చెదరకుండా తమ అరచేతులు
అడ్డుపెడితే మంచి మనస్సుతో మెట్టినింటివారు
వెలుగదా అమ్మ ప్రమిదలా! దీపావళి శోభలా!

3. నెచ్చెలులను వదలి అత్తింటిలో
అడుగు పెట్టిన అమ్మ
అద్దరిన వారు, ఇద్దరిన తాను
ఒకరికొకరు జ్ఞాపకాలుగా మిగిలిన నేస్తాలు

4. అత్తింట అగచాట్లు పడుతూ అమ్మ
వేణువై వేదనారాగాలు పాడితే
పుట్టింటి పరువాల వేణువు
స్థాణువై గూటిలో చేరి మూగదైంది

5. పెళ్ళికి ముందు అమ్మ నేర్చిన వీణ
మెట్టినింట్లో ఒక మూలన చేరింది
పుట్టినింట్లో తన నేస్తం అమ్మ తనను
తాకలేదనే అలుకతో తన తంత్రులు తానే తెంచింది

6. మెట్టినింట్లో అడుగిడగానే
పుట్టింట్లో పోతుందట అమ్మ స్థానం!
సంక్షోభంలో పడితే కాపురం
మెట్టినింట్లోనే ఉండాలట, ఇదెక్కడి న్యాయం?

7. గాలీవానా చెలిమితో ఉంటే చెలరేగవు తుఫానులు
అత్తా, కోడలూ పంచుకుంటే సమంగా మమతలు
ఉండవు కదా కుటుంబంలో ఏమీ కలతలు
ఇద్దరు అమ్మలూ దేవుడు సృష్టించిన కొమ్మలు

8. అమ్మా! నీవు అనంత ప్రేమమూర్తివి
అల్లుడిని కన్న కొడుకులా చూడగలవు
కోడలికి నీ ఒడిలో జోల పాడగలవు
అత్తమామల పాదపూజలు చేయగలవు

9. లెక్కలు బాగా నేర్చిన అమ్మ
పుట్టినింటికీ మెట్టినింటికీ మధ్యన
మమతలు పంచుతూ అమ్మ; మధ్యమధ్యన
ఒడిలో బిడ్డకి కొంత, అలిగే భర్తకి కొంత

10. పుట్టినింటికీ మెట్టినింటికీ మధ్య
వారధిలా దృఢంగా నిలిచే అమ్మ
రెండు కుటుంబాల సంబంధాల పగ్గాలను
చేతబట్టి, సారధిలా బంధుత్వ రథం నడిపే అమ్మ



# 3. అమ్మ - నాన్న

1. నాన్న మనసులో అమ్మ మమతల దండ
అమ్మ గుండెలో నాన్న కొండంత అండ
ఒకరితో ఒకరు లేనిదే సంసారం గుదిబండ
ఒకరికొకరు కానిదే సాగని బ్రతుకు బండి

2. కుందేలేమిటి, అమ్మ వంటింట్లో హరిణి
తెలుసుకదా! సహనానికి ఆమె ధరణి
నాన్న ప్రాణాలు దాచే కుంకుమభరిణి
నాన్నకోసం సజీవంగా దాటగలదు వైతరణి

3. అమ్మ శ్రమలో మరిగిన కాఫీలు చప్పరించి
పొగలు పొగలుగా ఆలోచించి
అమ్మ దయతో తాపీగా జీవించే నాన్న
వాలుకుర్చీలో తిష్టవేసే తత్వవేత్త

4. వృద్ధాప్యంలో నిష్క్రమిస్తే అమ్మ
బ్రతకలేడు జీవచ్ఛవంలా నాన్న
నాన్న గానీ వెళ్ళిపోతే ముందుగానే,
గుండెబలం, ఆత్మబలంతో దృఢంగా నిలిచే అమ్మ

5. పందిరిలాంటి నాన్నని తీగలా అల్లుకుంటూ అమ్మ
ప్రేమతో పందిరిని, దృఢంగా నిలుపుతూ అమ్మ
బుద్ధిగా, స్థిరంగా వుంటే తాను (నాన్న)
దారినపోయే తీగలు తగిలి జారిపడదు నాన్న

6. పుట్టింటివారినంటే అమ్మకెంత రోషం
ఒక్క చూపుతో కాలింది నాన్న మీసం
ఇంకా తగ్గని అమ్మ ఆవేశం
నోరు పెగలని నాన్నకి ఆశ్చర్యం!

7. తాగితూలుతూ నడిరేయిన గూటికి చేరే నాన్న
చెలరేగి వాగుతూ వెన్నెలని కలుషితం చేసే నాన్న
వాగి వాగి చేయి విసిరేస్తూ పడబోయే నాన్న
నాన్న క్రిందపడకుండా మళ్ళీ చేయందించే అమ్మ

8. నాన్న నోట ఎప్పుడైనా నాదీ నేనే అనేమాట
అమ్మ మనసులో ఎపుడూ మనదీ మనమనే ఊహ
నాన్న పైకం ఎప్పుడైనా వ్యసనాల్లో కరుగవచ్చు
అమ్మ డబ్బు ఎప్పటికీ ఇంటికోసమే ఖర్చు

9. తన పతి గాలివాటుగా వెళ్ళిపోయినా
అతనలా గాలిలోనే కలసిపోయినా
స్థిరంగా నిలిచి ఆమె మోస్తుంది కుటుంబ భారం
అమ్మలో సరిగ్గా సగం నాన్నతనం

10. ఊడిపోయి వున్న ఒక్క ఉద్యోగం
ఎప్పుడైనా కోల్పోయినా నాన్న ధైర్యం
అమ్మకెంత గుండె నిబ్బరం !
నిలుపుతుంది కూలిపోయే కాపురం.

11. నాన్నకి మాటిమాటికీ బదిలీలు
అమ్మకి భాష తెలియని ప్రదేశాలు
నాన్న నీడలో నడుస్తూ అమ్మ రేపగలు,
అంతఃపురం వీడి చేస్తుంది వనవాసాలు

12. షష్టిపూర్తి కాగానే నాన్న వెళ్ళిపోతే
మిగిలిన తన జీవితంలో పూవులన్నీ ఆయన మెళ్ళో వేసింది
కుంకుమ భరిణిలోని కుంకుమంతా ఆయనకే పూసింది
అమ్మ ధవళవస్త్రాల దేవత వేషం వేసింది

13. పదవీవిరమణ చేసిన నాన్న మెళ్ళో దండ
ఏదో ఒక పనికోసం బయటకు వెళ్ళే నాన్న ఇంట్లో ఉండకుండా
బ్రతుకునుంచే నిష్క్రమించిన అమ్మ మెళ్ళో దండ
అమ్మ వెళ్ళిపోతుంది మరోపని చేయకుండా

14. 'మీకంటే ముందుగానే వెళ్ళిపోవాలి'
ఎపుడూ అమ్మ నోటిలో ఇదేమాట
ఎన్నడూ అనడే నాన్న ఇలాంటి మాట
అమ్మకున్నంత ప్రేమ నాన్నలో లేదన్నమాట

15. సంసార వైరాగ్యం సహజంగా కలిగిన నాన్న
అడపాదడపా పెట్టె సర్దుకుంటాననే నాన్న
ఒక్కసారి కూడా జతబట్టలు సర్దుకోదు
సర్దుకుపోయే నైజం కలిగిన అమ్మ

16. నాన్న ఫోటోలోకి వెళ్ళేదాకా
అమ్మ వీధిలోకి వెళ్ళలేదు
బిడ్డల కోసం అమ్మ, నాన్న లేని సమాజంలో చరిస్తుంది
అమ్మ చల్లని నీడలో దిగులు మాని కుటుంబం తరిస్తుంది.

17. తెలుసుకోవే తల్లీ నాన్న అన్ని అప్పులు
లెక్కవేయవే అమ్మా! నాన్నకున్న ఆస్తులు
గమనించవే తల్లి నాన్న రోజువారీ వేషాలు
అడిగి తీసుకో నాన్నకొచ్చే జీతభత్యాలు

18. తీరికవేళల్లో నాన్నకిష్టం చతుర్ముఖ పారాయణం
సిగరెట్లు త్రాగడం, మందు సేవించడం, డబ్బు తగలేయడం.
వడియాలు పెట్టడం, స్వెటర్లు అల్లడం, పచ్చళ్ళు పెట్టడం
ఇది అమ్మకి ఓ జీవన విధానం, సమయం ఆమెకి ఒక సంపద.

19. నిత్యం శ్రమించే అమ్మని అప్పనంగా
నాన్న వెటకారంతో గీస్తే భగ్గుమంటుంది
ప్రేమతోటే అమ్మను జయిస్తే నాన్న
అగ్నిపర్వతం మంచు దిమ్మలా కరిగిపోతుంది.

20. పెళ్ళికి ముందు వాళ్ళమ్మ కొంగు
పెళ్ళయాక మాయమ్మ కొంగు
కొద్దిగా మార్చి తన రంగు,
ఓ కొంగు వెనకే నాన్న చెంగు-చెంగు.



21. నాన్న ఏళ్ళుగా చేస్తే గానీ ధ్యానం
తరలిరాదు అంత సులువుగా దైవం
అమ్మ కన్నీళ్ళతో చేస్తే ప్రార్థన
వచ్చి ఇచ్చి వెళతాడు అందరికీ దీవెన.

22. సెలవుదినం పనీపాటా లేక నాన్నకి బోరు
ఏ పూటైనా అమ్మకి తప్పని పోపుల హోరు
నాల్గు చేతులూ కలిపితేనే కదా పనిలో జోరు
ఇద్దరూ సాయంత్రం వెళ్ళవచ్చు సరదాగా షికారు

23. విభక్తులెరిగిన తండ్రి సంభోదన 'ఒసేవ్', 'ఏమేవ్'
వినమ్రత తెలిసిన తల్లి పిలుపు 'ఏవండీ', 'ఇదుగోండి'
అమ్మ నుండి నేర్చుకోడు నాన్న కాస్తైనా సంస్కారం
ఆమె మంచి చెప్పినా ఎందుకో అతని తిరస్కారం?

24. నాన్నకి తన శక్తిపైనే అమిత నమ్మకం
కానీ అతని ప్రతి విజయం వెనుక అమ్మ చేసిన పూజలున్నాయి
ఘోరారణ్యం ఈ సమాజం, నాన్నకెక్కువ ఆత్మస్థైర్యం
కానీ అతని మనుగడకోసం, అమ్మ నోచిన నోములున్నాయి

25. ఇంట్లోని ప్రతి వస్తువులో తొంగిచూస్తే నాన్న పొద్దస్తం,
అది మందులేని జబ్బు, వట్టి చాదస్తం
ఏదెలా ఉండాలో క్షుణ్ణంగా అమ్మకి తెలుసు,
నాన్నకీమాట తెలిస్తేనే సౌఖ్యం కదా గృహస్తం.

26. ఎన్ని విద్యలు నేర్చినా నాన్న
అమ్మకి మాత్రమే తెలుసు బిడ్డల్ని కనడం
ఎన్ని గ్రంథాలు చదివినా నాన్న
అమ్మకెక్కువ తెలుసు దేవుణ్ణి కనడం

27. కుందనపు బొమ్మకు తాళికట్టేసి
చందనపు చెక్కకు శిలువేసినట్లు
ఓ పదిగోడల మేడలో ఉంచేస్తే అమ్మను
కట్టె కాలనిదే ఆమెకు స్వేచ్ఛరాదు

28. ఆదివిష్ణువులా హాయిగా పవ్వళించి
అమ్మ చదువుతుంటే శ్రద్ధగా ఆలకించి
పరీక్ష ప్యాసయి, పదోన్నతి పొందిన నాన్న
అది తన విజయమేనని పొంగిపోతాడు మేనుపులకించి!

29. నిత్యం శ్రమించే తల్లి, ఎవ్వరి మాటలూ పడదు
అంతరాత్మ మాటలు వినే తల్లి, చెప్పుడు మాటలు వినదు
పగలంతా పనిచేసే తల్లి, పగటి కలలు కనదు
ఎంతటి వ్యక్తిత్వం వున్నా, నాన్న లేక మనదు

30. తన భర్త సేవ తప్ప మరొక
సత్యమెరుగని సత్యకాలపు సతీమణి
సత్యంతో సత్యాన్ని సాధించి,
సత్యంలో సత్యంగా ఐక్యమయ్యే సాధ్వి అమ్మ.



# 4. అమ్మతనం

1. నాజూకు నడకలు, సిగ్గుల మొలకలు
మామిడి ముక్కలు, చింత పులుపులు
మొన్నమొన్ననే తాను కన్నె కదా!
ఉదయ సంధ్యలా తాను నేడు అమ్మ కదా!

2. గున్నమామిడి చెట్టులా నిండుదనం
ముద్దబంతి పూవులోని సౌందర్యం
సామ్రాజ్ఞిలా ఆమె నడకలో నిండుదనం
పరబ్రహ్మాని మోసే ఆమెలో లేదు దాపరికం

3. భరిస్తుంది ఒక కాయంలో రెండు ఆత్మలు
మోస్తుంది తన కాయంలో మరో శరీరం
దాస్తుంది తన ప్రాణంలో మరో ప్రాణం
అమ్మకెంత ఋణపడి ఉన్నది లోకం!

4. తెలియని లోకాల్లో తిరిగే ఆత్మకి
తన గర్భంలో స్థానాన్నిస్తుంది
మానవ లోకాల్లో తిరిగే జీవాత్మకి
తన రక్తంతో చక్కటి రూపాన్నిస్తుంది

5. మోసి-మోసి కన్న శరీరం విలువ అమ్మకి తెలుసు
మృత్యు ముఖం చేరి-చేరి ఆత్మ అంటే తెలుసు
ఇహపరాలు రెండూ తెలిసిన అమ్మ
రెండు వరాలూ పొందిన జన్మ



చిత్రం : శ్రీమతి రీటా ముఖర్జీ



6. బిడ్డను కన్న అతివ ఎవరైనా అమ్మ
విత్తు నాటితే నేలలో, మొక్క మొలవదా!
నాటినవాడి చిరునామా లేకుంటే లేదు
అమ్మని అమ్మ అనడానికి ఎవడి నోటికి చేదు!

7. తొందరపడి బిడ్డను కంటే కన్య
కుటుంబమా అంగీకరించు; ఆమె ఇపుడు తల్లి
పొరపాటునైతేనేం ఆమె ఓ ప్రాణం పోసింది
సమాజమా! ఆశీర్వదించు, ఆమె ఇపుడు ఓ అమ్మ

8. మొగ్గ పూవై పూయడం,
పూవు కాయై కాయడంలా
అతివకు సహజం
బిడ్డకు అమ్మ కావడం

9. అమ్మని కనమనీ, కూడదనీ అనే అధికారం
ఎవ్వరికీ లేదు ప్రపంచంలో
దేవుడెవరినడిగి ఈ లోకాలు పుట్టించాడు
కనేవాళ్ళకు ఎవ్వరి అనుమతీ అక్కరలేదు ధరిత్రిలో

10. తన మమతల దారంతో
రాబోయే బిడ్డకు వెచ్చదనం అల్లుతూ అమ్మ
శరీరమవుతుంటే భారం
ఇంకా తాను చూడని ప్రాణిని ప్రేమిస్తూ అమ్మ

11. కోట్ల తీర్థాల కోవెలల్లోని తీర్థం
అమ్మ పాలు పరమ పవిత్రం
ఏడాది పాటైనా అమ్మ ఒడిలో
పెరిగితేనే బాల్యానికో అర్థం

12. తానిచ్చే ప్రతిజన్మ తనకో పునర్జన్మ
ప్రతి ప్రసవం ఒక గండం,
ప్రాణం పోయే ప్రమాదం
అయినా బిడ్డ రాక అమ్మకి ప్రమోదం

13. తన గర్భాన కనులు తెరువని బాల
తన హృదయాన మధుర ఊహలతో మాత
ఏ స్వార్థానికీ తావులేని బంధం
అమ్మతనం సృష్టి యావత్తుకే అందం



చిత్రం : కుమారి ప్రవల్లిక

# 5. అమ్మ - పిల్లలు

1. అమ్మ పాటకు శ్రోతలిద్దరే
పొద్దున్నే హారతులందుకుంటూ దేవుడూ
ఊయల్లో రాగమెత్తుకుంటూ బిడ్డడూ
అదృష్టవంతులు ఇద్దరికిద్దరూ

2. నాన్నంటే అందరికీ భయం-భయం
కొత్త షర్టుకి అమ్మతోటే రాయబారం
అమ్మకి తెలుసు నాన్నకది తలకు మించిన భారం
సర్ది చెప్పి కుదురుస్తుంది ఏదో ఒక బేరం

3. నిన్న అమ్మ ఆహ్వానం 'వచ్చి భోంచెయ్యి'
నేడు అమ్మ నినాదం 'ముందు పుస్తకం తియ్యి'
తరాలు మారినా అమ్మ తపన తనయకోసం
యుగాలు మారినా అమ్మ బ్రతుకు బిడ్డల కోసం

4. అమ్మ పెట్టినట్లుగా తృప్తిగా భోజనం
అమ్మకి పెట్టగలిగిన కొడుకింకా పుట్టలేదు
అమ్మ వేసినట్లు బాల్యంలో తనకి పూల్జెడ
అమ్మకి వేయాలనే ఆలోచన ఏ బిడ్డకింకా తట్టలేదు

5. పాతికేళ్ళు వాడిని పెంచి తన గుండెల్లోన
ఒక పడతి చేతిలో పెట్టింది పెళ్ళి పందిట్లోన
అమ్మ అలా వెళ్ళిపోగానే వంటింట్లోకి
వాడు జీతమంతా పోస్తాడు పెళ్ళాం దోసిట్లోన





చిత్రం : శ్రీ మోహన్



6. పెద్దవాడి జీతం తక్కువ, కానీ ఎక్కువగా ఇచ్చిందేమో ఎక్కువ
చిన్నవాడి సంపాదనెక్కువ, కానీ వాడికి డబ్బులంటే మక్కువ
ఇంటికోసం ఎవరెంతివ్వాలో అమ్మకి తెలుసు, కానీ కొడుకులు ఎవరికి వారే
అమ్మ లెక్కలు వేరే, కొడుకుల లెక్కలు వేరే

7. శైశవంలో అమ్మ చెప్పిన నీతులు,
సమాజంలో ధర్మసూత్రపం పునాదులు
ఇంటిగుట్టు దాచే అమ్మ ఇంటికప్పు;
ఆధారం తానే అమ్మ, పై ఆకాశం తానే.

8. అ,ఉ,మ లతో కూడిన శబ్దం ప్రణవం
'అ', 'మ'లతో కలసిన శబ్దం అమ్మ
"ఉ,ఉ" అనీ ఉంగా అనీ రోదించే బాలలు
అటునుంచీ, ఇటునుంచీ బిడ్డను కాపాడే అమ్మ

9. రాబోయే రోజుల్లో ఎవరి పాలో బ్రతుకు
చీకట్లను మరపిస్తూ అమ్మనోట లాలిపాట
వెచ్చని అమ్మ ఒడిలో బిడ్డలెంత సురక్షితం
ఆ పిల్లల కనుపాపల్లో ప్రపంచం సుందరదృశ్యం

10. అమ్మ ఒడిలో పూసిన పువ్వులు
చదువుకోసం, బ్రతుకు తెరువుకోసం
ఆమెకి దూరమైతే వాడిపోయే నవ్వులు
అమ్మ జ్ఞాపకంతో చెమ్మగిల్లే కళ్ళు

11. ఎదిగిన కూతురి సరసన నడుస్తూ అమ్మ
ఎరుగదా యువకుల చూపుల సంగతి
పరువపు సొగసులు కలిగిన బిడ్డను,
ములుకుల చూపుల కంచెలువేసి రక్షించే అమ్మ

12. ఆహారం నోటికందించే మహిళెవరైనా అమ్మ
వాత్సల్యం మనసున నింపేసే అతివెవరైనా అమ్మ
కాచే గుణం లేకుంటే కొన్ని చెట్లకు ఫలాలుండవు
ఏ రుణం లేకుంటే కొందరమ్మలకి పిల్లలుండరు

13. తల్లి పట్ల చూపరా వినయం
ఇక బ్రతుకులో లేదురా అపజయం
విధేయుడవైతే అమ్మకి,
అజేయుడవవుతావు జన్మజన్మకీ

14. తన కొడుకు నడుపుతుంటే సైకిల్‌మోటర్
వినిపించే శబ్దం అమ్మ గుండె చప్పుడు
తన కూతురు నడుస్తుంటే వీధిలోన
కనిపించని తోడు అమ్మ ఆరవప్రాణం

15. నాన్న క్రోధాగ్నిని మౌనంగా మింగేస్తూ అమ్మ
నీకోసం అగ్నినైనా భక్షించే అమ్మ
ఎన్నిసార్లు భరించింది నీకు పడాల్సిన దెబ్బలు
ఎన్నిమార్లు సహించింది నీకు జరగాల్సిన శాస్తిని





చిత్రం : శ్రీమతి రీటా ముఖర్జీ

26. కడుపుకి మళ్ళీ మళ్ళీ మండే గుణం
అమ్మకి అన్నంపెట్టి మంటలార్పే గుణం
అమ్మలే లేకుంటే ప్రపంచంలో తప్పదు
సోదరుల మధ్యనే భీకర రణం

27. అప్పుడప్పుడూ అమ్మంటే
నాన్నకేదైనా ఉంటుందేమో అంటూ, గింటూ
ఎల్లప్పుడూ అమ్మ కొంగు
పట్టుకుతిరిగే బిడ్డలకి అమ్మ నిత్యం పవిత్రం

28. అమ్మ మనస్సు, దాటి దేశపు ఎల్లలు
అమెరికా ఆకాశంలో తిరుగుతున్నది
ఒకరి పిదప ఒకరుగా బిడ్డలు
ఎగిరిపోతే ఖండాంతరం; రెక్కలొచ్చిన పక్షులు

29. చంకలో బిడ్డ నెత్తుకుని
వేగిరంగా గరిట తిప్పుతూ వంటలు చేస్తుంది
వీపున బిడ్డను కట్టుకుని
లాఘవంగా కత్తి తిప్పుతూ యుద్ధమూ చేస్తుంది

30. అమ్మ స్పర్శతో మటుమాయం బిడ్డ జ్వరం
మాయమైన జ్వరం మా యమ్మలో ప్రత్యక్షం
బిడ్డ బాధలు చూసి అమ్మలు భరించలేరు
ఎవరో ఒకరు అనుభవిస్తే గాని కర్మలు నశించవు






చిత్రం : కుమారి ప్రవల్లిక

31. అమ్మ తనకు తెలిసి కన్నదా కొడుకుల జాతకాలు?
ఒకడికొకడు ఎదురు నిలిచి పట్టారు తుపాకులు
ఒకడి మనసు ఎరుపుమయం, ఒకడిది ఖాకీలోకం
ఏ తూటా లక్ష్యం చేరినా, అమ్మకే గర్భశోకం

32. రేపైనా భూలోకం స్వర్గంలా మారదా!
నా బిడ్డైనా ఈ లోకం దివ్యంగా మార్చడా!
అనే తలంపుతో అమ్మ నాన్నతో చేసింది పాణిగ్రహణం
అదే ఆశతో అమ్మ బిడ్డకి పోసింది ప్రాణం

33. దేవుడూ తల్లులూ ఒక్కటే జాతి
పిల్లల కోసం తల్లులు చేస్తే పూజలు
కరుణించడా దేవుడు అమ్మ కోసం
దివిని వీడి దిగిరాడా భూలోకం

34. పేరు చివరని గారు తొడిగితే
మనుషుల మధ్య పెరిగే దూరం
అమ్మ పేరులో అందుకే గారు లేదు
అమ్మకీ బిడ్డకీ మధ్య గాలి కూడా లేదు

35. చీకటికి భయపడితే బాసటగా ఎదురుగ అమ్మ
ఆకలికి సొదపెడితే గోరుముద్దలతో అమ్మ
అడుగులు తడబడితే ఆసరాగా నిలిచిన అమ్మ
గడచిన బాల్యంలో కనులలో నెలకొన్న ఒకే ఒక్క రూపే అమ్మ



36. అమ్మ కూతురు ఇపుడు ఓ బిడ్డ తల్లి
అమ్మకీ, నాన్నకీ ఇపుడు ఆ బిడ్డే తల్లి
ఒక్క కూతురిని కంటే చాలదా అమ్మా!
కొడుకులెందుకే తల్లీ, నీ ఆస్తులు తెగనమ్మ.

37. అమ్మ తన కడుపులో మోయగా లేనిది నీ శరీరం,
అమ్మ నడుపుతుంటే ద్విచక్రవాహనం
వెనుక సీటుపై కూర్చునేందుకు అంత కినుకెందుకో!
నీకు మీసాలతో పాటు కస్సుబుస్సులు మొలిచాయెందుకో!

38. ఆరడుగుల పొడగరి కొడుకులు
దుఃఖమొస్తే అమ్మ ఒడిలోనే ఒదిగిపోతారు
ఎంత ఎదిగినా బిడ్డలు బిడ్డలే,
అమ్మ అన్నంలో ప్రేమ కలిపి పెడితేనే అంతలా ఎదిగిపోయారు

39. వర్తమానంలో తల్లిదండ్రులు తమ
భవితను మలచి సుందర స్వప్నంగా,
దాతలై కాళ్ళు కడిగి చేస్తారు కన్యాదానం
ఏ వరుడికైనా ఇంతకంటే ఏమున్నది గొప్ప కట్నం?

40. భోజనాల వేళలో తనంతట తానుగా
చివరన తింటే అమ్మ, అది అమ్మల నైజం
అమ్మకు మిగిలిన మెతుకులు పెడితే
తనయులూ వారి కుటుంబం, అది కొడుకుల క్రౌర్యం

41. బిడ్డ తల చుట్టూరా తిప్పి గళ్ళఉప్పు
దృష్టి దోషం తొలగిస్తుంది
కుడిచేతికి కట్టే కాశీతాడు
బిడ్డకు రక్షణ కలిగిస్తుంది.

42. 'మరుజన్మలో నేను మీ కడుపున
బిడ్డనై మరల పుడుదునా' అని అడిగితే
'నేను మరుజన్మ కోరనని' బెదిరిన నాన్న
'నీ కోరిక నే కాదనలేనని' మురిసిన అమ్మ

43. రామనామము మించిన మధురిమ జగతిన
లేదని నేనారాముడితో అంటే రాముడన్నాడు,
'పిచ్చివాడా అమ్మను మించిన మధురిమ లేదు
అందుకే నేనూ ఓ అమ్మ కడుపున జన్మించాను'.

44. 'ఈ తల్లికి వేరొక పనిలేదా?'
నిరంతరం పిల్లల తపనతోనే తన బ్రతుకునీ,
అహరహరం బిడ్డల ధ్యాసలోనే తన మనస్సునీ నింపుకునే
'ఈ తల్లికి మరొక ఆలోచన రాదా?'

45. తల్లి మనస్సు నిస్సంశయంగా
కరుణ నిండిన తటాకం
రెండు కళ్ళు దానికి గవాక్షాలు
బిడ్డల కోసం సిద్ధంగా కన్నీటి ప్రవాహాలు





చిత్రం : చిరంజీవి ఎమ్. కార్తిక్



చిత్రం : చిరంజీవి కె. శాయి హర్షిణి



చిత్రం : చిరంజీవి మౌష్మి



చిత్రం : చిరంజీవి హరి అనీశ్

46. ఇరుగు పొరుగును వెక్కిరిస్తే తగదన్నది
అప్పనంగా ఏదైనా ఆశిస్తే వద్దన్నది
ఎవరూ చూడదు లెమ్మని తప్పు చేద్దామంటే
అమ్మ నా గుండెలో కనిపించని దేవుడి భయం నింపింది

47. సహజంగా అమ్మ పలుకులు చెరుకు తీపి
అపుడపుడూ అమ్మ నీతులు కరకు చేదు
ఉగాది పచ్చడిలాటి బ్రతుకు మనది
అన్ని రుచులు చూస్తేనే బ్రతుకు సుళువు

48. చదువు బ్రతుకులో కేవలం ఒక భాగం
విఫలమయితే చదువులో అంతమా జీవితం!
కమ్ముకుంటే నీ చుట్టూరా నైరాశ్యం, యువకుడా!
ఒక్కసారి అమ్మ ఫోటో చూడు, బ్రతుకుతావు నూరేళ్ళకు సరిపడా.

49. సరదాగా బాల్యంలో పలికే చిన్న అసత్యాలు
అలవాటైతే యవ్వనంలో పీడవు నిను చట్టాలు
అందుకే చిన్నతనంలో అమ్మ వేసే ప్రతి దండన
భవితలో నీ బ్రతుకున నిలుస్తుంది పాఠమై నీకు అండగా

50. అమ్మా నాన్నలు, దేవుడూ, గురువూ
ఈ నలుగురిలో అమ్మదే మొదటి స్థానం
అందరూ ఒకేసారి కలిసివస్తే, అమ్మకే మొదటి గౌరవం,
భారతీయ సంస్కృతిలో ప్రతిరోజూ మాతృదినోత్సవం.



51. దుబాయి దేశంలో కొలువు చేసేవాడు
ఏడాదికి ఒకమారు ఇంటికొచ్చే కొడుకు
కనుచూపు మేరంత దీపాలు వెలిగించినట్లు
ఎదురుచూచేను అమ్మ, కొడుకు విమానం దిగనున్నట్లు

52. అమ్మ కంట నీరు పారనీయకు
యువకుడా! ఆమె ఇంట దుఃఖం చేరనీయకు
అమ్మ నవ్వకుంటే శాంతి పూవులు పూయవు
కుమారుడా! జగతిన అశాంతి చెలరేగనీయకు

53. అమ్మకు నీవే తన సర్వస్వం
నీవు ఆమెకు కాగలవా
కనీసం అందులో సగం!
ప్రేమలో అమ్మకి పోటీలేదు, ఇది నిజం!

54. అమ్మ అనే తీగకు పూచిన పూవులా పసిపాప
అమ్మ తినిపిస్తుంటే గోరుముద్దలు -
కనిపించే దృశ్యం అతి కోమలం
పెనవేసిన ఇద్దరి బాంధవ్యం నవనీతం.

55. పిల్లల పరీక్షలొస్తే, అమ్మ కంటికి కునుకురాదు
బిడ్డకో పరీక్ష, కాని అమ్మకే పెద్ద చిక్కు
ఫలితాలొస్తే ముందర అమ్మ గుండెలో దడ
ఎవరు ప్యాసయినా అమ్మదే మొదటి మొక్కు

56. నీ వల్లనే మారుతుంది ఈ సౌమ్యజీవి కర్కశంగా
నీకోసం వదిస్తుంది మృదుభాషి కాఠిన్యం
అమ్మ మాట వింటే నువ్వు తూచా తప్పకుండా
ఫలిస్తుంది నీ బ్రతుకు లక్షణంగా

57. నీకూ, నీ తల్లికీ మధ్య ఉండవచ్చు అభిప్రాయభేదాలు
అయితే ఉండవా మీ మధ్య మమతానురాగాలు?
దేవుడి పిలుపొస్తే ఆమె ఒడినే మరణించవా?
అయన కరుణిస్తే మరల ఆమె గర్భాన జన్మించవా?



# 6. అమ్మ - ఇల్లు

1. ఇంటితో అమ్మకి ఎంత గట్టి బంధం!
నాలుగు గోడలూ, ఒక కప్పుకీ ఆమెతోటే అందం
గోడలోనూ జీవం చూడగలిగే అమ్మ
నాన్నతో ఎడారిలోనూ కాపురం చేయగలిగే అమ్మ

2. చుక్కలు అమ్మ కురులపై
నీటిచుక్కలై మెరిసే వేళలో
తులసికోట చుట్టూరా ఆమె ప్రదక్షిణలు
అమ్మ నుండి అమ్మకి దివ్యశక్తీ, దీవెనలు

3. వేకువనే పెడితే ఇంటి ముంగిట ముగ్గులు
విందుకు బారులు తీరిన చీమలూ, పక్షులు
వాటికి ముగ్గులో బియ్యమిప్పింది ఆహారం
అమ్మ కదా! ఆమెది వసుధైక కుటుంబం

4. దైవనామాలు వల్లిస్తూ ఆమె చేసే వంటకాలు
ఇంటిల్లిపాదికీ అమ్మ శక్తి పంపకాలు
పనిచేసే నాన్నలోనూ, చదివేసే పిల్లల్లోనూ
అమ్మ ఇచ్చిన శక్తులే అత్యంత కీలకాలు

5. ఉదయాన్నే పూజలు చేస్తూ దివ్యత్వంలో అమ్మ
అందరి ఆకలీ తీరుస్తూ అన్నపూర్ణలా అమ్మ
సంధ్యా దీపం వెలిగిస్తూ ఆదిలక్ష్మిలా అమ్మ
అక్షరాలు దిద్దిస్తూ అపర సరస్వతిలా అమ్మ

6. ఇంటి బరువు గుండెల్లో మోసే అమ్మ వసుధ
లోన చీకటి తరిమేసే అమ్మ నట్టింట ప్రమిద
దుఃఖరవాలన్నీ అణచివేసే అమ్మ ప్రణతి
ఇన్ని తానైన తల్లికిదే అందరి ప్రణతి.

7. సాక్సునీ, టిఫిన్ బాక్సునీ, బూట్లనీ విసిరేసే నాన్న
గరిటనీ, గిన్నెనీ, గ్లాసునీ గౌరవించే అమ్మ
ఎవరు పారేసినా వస్తువులన్నీ అమ్మకే కనిపిస్తాయి
తమని గౌరవిస్తే వస్తువులు మనని గౌరవిస్తాయి

8. తూరుపు కొండ గుండెలోంచి సూరీడు
తొంగి చూడకముందే అమ్మ నిదురలేస్తుంది
మేఘం కొంగుచాటుకి చంద్రుడు
చేరినప్పుడు తాను మేను వాలుస్తుంది

9. సూర్యచంద్రులు విశ్రమించినా
అమ్మ మాత్రం పరిశ్రమిస్తూనే వుంటుంది
కుటుంబసభ్యులు ఆమె చుట్టే పరిభ్రమిస్తారు
నిస్సహాయులై ఒక్కొక్కరూ ఆమెనే ఆశ్రయిస్తారు

10. పరీక్ష తప్పిన పిల్లలూ,
ప్రేమలు విఫలమై అక్కలూ,
పదోన్నతి పొందని తండ్రీ,
తలలు దాచుకునేది అమ్మ కొంగులోనే.



11. జీవకోటి అమ్మకి మిత్రకోటి
ఆవులూ, నాగులూ అమ్మకి వేల్పులు
రావిచెట్టూ, తులసిమొక్క అమ్మకి దైవకోటి
చరాచర జీవులన్నీ అమ్మకి బంధుకోటి

12. రెక్కలొచ్చిన తాతయ్య కళ్ళజోడు
దిక్కులన్నీ తిరిగే నాన్న ఫైలు
పారవేసుకున్న అక్కయ్య పక్కపిన్ను, దాచిపెట్టిన అన్నయ్య పుస్తకం
ఏదెక్కడుందో అమ్మకి తెలుసు, వేయకుండానే అంజనం

13. తన తండ్రిది గొప్ప పాండిత్యం, అమ్మ చదివింది తండ్రి మేధస్సు
తన భర్తది ఉన్నతోద్యోగం, అమ్మ చూసింది భర్త స్వభావం
తన బిడ్డల విద్య సాంకేతికం, ఆమె గమనించింది వారి నైజం
అందరివీ గొప్ప-గొప్ప స్నాతకాలు, అమ్మ చదివింది ఒక్కొక్కరి జీవితాలు

14. మనిషిని నమ్మిన మానులా, అమ్మ అమాయకం
బిడ్డ కష్టాల కొలను కూడా, ఆమెకో కడలి
భర్త మోసాల నటనకి కూడా, ఆమె కంట కన్నీరు
అమాయకత్వం తోడుగా లేకుంటే దేవుడు, అమ్మ బ్రతుకు బహుకష్టం.

15. పోపుల డబ్బాలో దాచిన డబ్బులు,
నాన్న చేతిఖర్చుకీ, అక్క కొత్త సినిమాకీ
తన సిగలో పూలకీ, దేవుడి మెడలో మాలకీ,
బిడ్డల జీళ్ళకీ; ఇన్ని డబ్బులు సరిపోతాయ్ ఎన్ని పనులకీ?

16. లంకంత కొంపలో కొడుకూ, కోడలూ
ఆంగ్లంలోనే పలికే పెద్దలూ, పిల్లలూ
అమ్మ వీరందరికీ చాకిరీ చేస్తున్నా
ప్రేమతో మాట్లాడే మనిషి మాత్రం సున్నా

17. అనుకోని అతిథికి క్షణంలో సిద్ధం భోజనం
అమ్మ సొంతం అక్షయపాత్ర
తీవ్రమైన వేదనకి దివ్యమైన ఔషధం
అమ్మ కమ్మని మాటే సంజీవని మాత్ర

18. కడుపారా ఆరగించిన పిల్లలూ
మనసారా పరవశించిన తండ్రీ
అమ్మా! నీకెవ్వరూ చెప్పరు కృతజ్ఞత
నీది వేతనం లేని ఉద్యోగమట

19. అమ్మ నగల ధగధగలు
చూస్తే నాన్న కెంత వగలు
అమ్మ కంఠాన చంద్రహారం
నాన్న ఊహల్లో కొత్త వ్యాపారం

20. పంచకు తల్లీ స్త్రీధనం
వస్తే నీకు ఆపత్కాలం
అదైనా ఉండనీ ఆధారం
పెట్టుకోకెవరి పైనా నమ్మకం

21. బిడ్డలు చేస్తే వ్యాపారం
అమ్మా! పెట్టకు హామీ సంతకం
రేపేదైనా జరిగితే
నీవే వారికి ఆధారం

22. ప్రవహించే నదిలాంటి అమ్మ
నది ప్రక్కనే నాగరికతలా
బిడ్డల బ్రతుకులు అమ్మ చాటునే
నదిలో మునిగి తేలుతూ నాన్న

23. జననం అంటే తెలిసిన తల్లి
మృత్యువు భుజం తట్టిన తల్లి
ఆత్మహత్య ఆమె ఉత్త బెదిరింపు
తరుణుకోరితే నాన్న, తొలగిపోతుంది ముప్పు

24. నాన్నకు బాగయితే ఆరోగ్యం, మొక్కుగా
వెంకన్నకు తన నగలన్నీ సమర్పించింది
ఇంటికెవరో పాడబోతే వేలం, వెంటనే
అమ్మ తన ఆస్తులమ్మి ఇంటి పరువు నిలిపింది

25. అరచేతుల్తో ఉప్పూకారం బేరీజువేసి వేస్తుంది కూరల్లో
తన చూపుల్తో మంచీ-చెడూ పసిగడుతుంది మనుషుల్లో
తన మాటల్తో కూరలమ్మిని పడగొడుతుంది బేరాల్లో
అమ్మ తన మౌనంతో నిరసన తెలుపుతుంది పేచీల్లో



26. వాయువులు ఎక్కువైన లోకంలో, దెబ్బతిన్న ఉదరకోశం
అమ్మ చేతి శొంఠిపొడి, డాక్టర్లకు కంటతడి
కోలాల సేవనం, రోగాల జీవనం
కడుపులో చల్లగా, అమ్మ చేతి మజ్జిగ

27. ఆధునిక సమాజానికి బోలెడు టెక్కులు
ప్రతి చిన్న జ్వరానికీ ఆంటీబయోటెక్కులు
అమ్మ చేతి మిరియాల కషాయం
గ్లాసుడు చాలు, పరారుకావా జలుబూ, జ్వరం

28. నాజూకుగా మారిన నాగరికుల
కంట్లో పడని కుంకుడు పులుసు
అందుకే కురచగా కాంతల కేశాలు
పలచగా యువకుల కేశాలు

29. ఇస్తూ నాన్నకి సలహాలూ, సంప్రదింపులూ,
చేస్తూ పిల్లలతో పుస్తక పఠనం,
అలాగే పెద్దలతో పురాణ కాలక్షేపం,
అమ్మ నిజంగా అందరికీ గొప్ప నేస్తం.

30. కుటుంబహారంలో కనిపించని దారం అమ్మ
సంసార వీణపై రాగం అమ్మ
నాన్న ఉత్తరీయంలోని గౌరవం అమ్మ
తన ఇంటి రాజ్య వైభవం అమ్మ

# 7. అమ్మ - చదువు

1. అన్ని పనులలోను అమ్మ చూపేను శ్రద్ధ
చదువు సంధ్యలలో కూడ తీసిపోలేదు
అక్షరాలు దిద్దింది, ఉత్తరాలు వ్రాసింది
మనకి నవరసాలు నిండిన కావ్యాలు ఇచ్చింది

2. మాత లోపాముద్ర వేదపండితురాలు
అమ్మ మైత్రేయి బ్రహ్మవాదిని
అమ్మ దర్శించిన వేదమంత్రాలు
చతుర్వేదాలలో నిక్షిప్తమయినాయి

3. ఇక్ష్వాకుల కాలం నుంచీ
అమ్మ విద్యా విశారద
శాతవాహనుల రాజ్యంలోనూ
పాండిత్యం కలిగిన రాజమాతలు

4. తేటతెలుగులో అమ్మ
వ్రాసింది రామాయణం
కవయిత్రి మొల్ల
ఆమెకు కనకాభిషేకాలు

5. అరఘడియలో వంద శ్లోకాలు
వల్లించిన తల్లి శుకవాణి
వెంకన్ననే పతిగా భావించి
కీర్తనలు వ్రాసింది అమ్మ వెంకమాంబ



6. అమ్మ నేర్వలేని విద్యలే లేవు
అమ్మ సాధించలేని కళలు లేవు
చదువు నేర్పిన తల్లులెందరో
అందరికీ శతకోటి వందనాలు

7. పెళ్ళినాటికి అమ్మ కళాశాల వీడలేదు
గర్భవతిగా తాను చదివింది పాఠాలు
బాలింతరాలుగా పరీక్షలు వ్రాసింది
బిడ్డనెత్తుకుంటూ పట్టాను పొందింది

8. కంట తడుల వెనుక కడుపాకలి చూసింది
మాయ మాటలలోని మర్మాలు గాంచింది
బ్రతుకు పుస్తకంలోని పుటలన్నీ చదివింది
జీవన విద్యావేత్త, అమ్మ వివేకవంతురాలు



చిత్రం : చిరంజీవి సాయి వంశీ గౌడ్

# 8. అమ్మ - ఉద్యోగం

ఆధునిక సమాజమో, మానవ
నూతన జీవన విధానమో!
అమ్మని కూడా ఆర్జించమన్నది
అమ్మ వానిటీ బ్యాగుతో పరుగెడుతున్నది

2. ఒక చేయి సాచి వంటకాలు
మరొక చేయి సాచి సంతకాలు
అమ్మ నిజంగా సవ్యసాచి
బహుముఖ ప్రజ్ఞకి అమ్మ కాణాచి

3. అమ్మ ఎక్కడయినా అమ్మ
బళ్ళో పాఠం చెబుతూ పంతులమ్మ
ఏకంగా జిల్లానే ఏలేస్తూ కలెక్టరమ్మ
దేశాన్ని పరిపాలిస్తూ మినిస్టరమ్మ

4. ఇంటికొక్క జీతం చాలనివ్వని సమాజం
అమ్మ కూడా చేయాలట ఇక ఉద్యోగం
బ్రతుకు పందెంలో ఆమె నాన్నతో సమానం
ఇంటా బయటా అమ్మకి చేయాలిక సన్మానం

5. ఉద్యోగం చేసే అమ్మ ధరిస్తే గర్భం
సంవత్సరం పాటు ఉచితంగా సెలవు ప్రకటించు
ప్రభుత్వమా! క్రెష్‌లలో పెరిగిన బాల్యం
ప్రేమకు దూరమైతే మునుముందు సమాజం వికటించు!





చిత్రం : శ్రీ నివాస్

6. ఒక్క ఇంట్లో అంట్లు తోమితే
అలసిపోయేరు అందరు వస్తారులూ!
నాల్గు ఇళ్ళలో రెండుపూటలా పనులుచేసే
అమ్మలందరూ ఎంతటి శ్రమజీవులు!

7. సవితలా వెండితెరలను వెలిగించిన అమ్మ
నిర్మలమాతలా మమతలు కురిపించిన అమ్మ
సూర్యకాంతమై తెరను మండించిన అమ్మ
నిన్ను కన్న అంబలా కన్నీరు తెప్పించిన అమ్మ

8. వెండితెరపై సాక్షాత్కరిస్తే అమ్మ
కంటనీరు పెట్టనివాడు రాతిబొమ్మ
యమునలా నర్తించి, సావిత్రిలా జీవించి
గుండెలు రంజింపజేసిన అమ్మను వేనోళ్ళ కీర్తించు

9. అమ్మ శుభలక్ష్మి, గానంలో సరస్వతి
అమ్మ గృహలక్ష్మి, ఆఫీసులో బృహస్పతి
భళిరా అమ్మ, కారుణ్యానికి పార్వతి
అమ్మ మనసా, ముగురమ్మల రూపా!

10. భారతదేశపు నాలుగుమూలలా
వైశ్య, పొడవున రహదారులు వేసినా
పట్టణాలలో ఆకాశహార్మ్యాలు నిర్మించినా,
తనకంటూ సొంతగూడు లేని లంబాడీ తల్లి,



11. ఏరినట్టే బియ్యంలో రాళ్ళను
ఏరుతుంది సంఘంలో నేరగాళ్ళను
దంచినట్టే రోకట్లో వడ్లను
దంచుతుంది అమ్మ పోలీసై రౌడీలను

12. వ్యాపార సంస్థల పాలనామండళ్ళు
మగ మహారాజులతో నిండిన లోగిళ్ళు
ఏడుగురు డైరెక్టరులలో ఉంటే కనీసం ఇద్దరమ్మలు
కూలవుకదా పేకమేడల్లా గొప్ప సంస్థలు!

13. మగాడికి మహిళ ముందు అహం కొండంతలు
తనపై అధికారిణికి ముందు ఎందుకో తలవంపులు
నీ తప్పు ఉంటే ఒప్పుకుంటే గొడవ గోరంతలు
మగాడా! అమ్మ మాట వినకుంటే తప్పవు తిప్పలు

14. ఇంటికొకరి కూలి సరిపోక
కూలితల్లి కూడా ఎపుడో కూలిపనిలో చేరింది
ఇంటికొకరి జీతం సరిపోక
మధ్యతరగతి తల్లి కూడా ఇపుడు ఉద్యోగం చేస్తుంది

15. కుటుంబాన్ని సక్రమంగా నడిపే తల్లికి
కర్మాగారాన్ని నడిపించడం కాదేమీ పనిభారం
చేసే ఖర్చుల కంటే వచ్చే రాబడి
అధికం చేయడం ఆమెకసలు కాదు కష్టతరం



చిత్రం : శ్రీ మోహన్



16. బడి గంటకీ, గంటకీ మధ్యన
గంటల తరబడి నిలబడి
గొంతు చించుకుని పాఠం చెబుతూ
భావిపౌరులను తీర్చిదిద్దుతూ అమ్మ

17. అందరికీ అన్నం వడ్డిస్తున్నట్లు
అమ్మ వేస్తుంది పొలంలోన వరినాట్లు
లేనిదే ప్రతినిత్యం అమ్మ సాయం
నాన్న చేయగలడా ఒక్కడే వ్యవసాయం

18. అమ్మపైనే ప్రసరించే
ఉదయభానుడి మొదటి కిరణం
ప్రాతఃకాలం వీధులన్నీ
శుభ్రం చేస్తే ప్రతినిత్యం అమ్మలు ప్రత్యక్షం

19. ఒక్క పని మాత్రమే చేస్తూ
పనులకు సమయం చాలదంటూ పరిగెత్తే నాన్న
ఇంటి పనీ, ఆఫీసు పనీ చేస్తూ
పరిగెత్తే కాలానికి కవలపిల్లగా పుట్టేసిన అమ్మ

20. విస్తరాకులు కుట్టి మన విస్తళ్ళు నింపింది
పూలమాలలు అల్లి మన బడి ఫీజు కట్టింది
ఆఫీసులో పనిచేసి పెళ్ళిళ్ళు చేసింది
కోటివిద్యలు నేర్చి మన భవిష్యత్తు దిద్దింది

# 9. అమ్మ - ఆరోగ్యం

1. తన స్వంత పనులంటే అమ్మకి నీరసం
తన ఆరోగ్యం పట్ల తనకే బోలెడు నిర్లక్ష్యం
గాలిపీల్చదా, నీరు త్రాగదా ప్రతివృక్షం
ఎందుకమ్మా! నీ పట్ల నీకింత అలక్ష్యం

2. ఒక పరి సివంగిలా పరిగెత్తే నీ బిడ్డ పట్ల,
హరిహరి ఫిరంగిలా పేలిపోయే నీ భర్త పట్ల,
సరిసరి మర్కటంలా గంతులేసే నీ కొడుకు పట్ల,
ఇక సరి, రవ్వంత ధ్యానపెట్టుకోవే తల్లీ నీవు నీపట్ల.

3. మధ్యాహ్నపు మండుటెండలో అమ్మ
చింకిచాపపై వాలిస్తే మేను
పనిమనిషి తన నిదుర తలుపులు బాదేను
ఘడియంత విశ్రాంతి కూడా క్షణంలో కరగిపోయేను

4. కుట్టు మిషీను తొక్కుతూ
మధ్య మధ్యలో దగ్గుతూ అమ్మ
శ్రమ ఎక్కువై, ఆమె ఊపిరి లయ తప్పింది
తిండి తక్కువై, ఆమెకు క్షయ వచ్చింది

5. నాన్న పొగత్రాగుతుంటే అమ్మ దగ్గుతున్నది
ఆయన మందు సేవిస్తే అమ్మ ఆరోగ్యం పాడవుతున్నది
అనవసరంగా ఆమె మాత్రలు మ్రింగుతున్నది
నాన్న దురలవాట్లతో అమ్మ ఆరోగ్యం కృంగుతున్నది



6. ప్రకృతిలో మారే ఋతువుల్లా
మాత శరీరంలో మార్పులు
వసంతమే క్రమంగా శిశిరమవుతున్నా
శిశిరంలోనూ పాడే కోయిల అమ్మ

7. తల్లిగా పాలసంద్రమై పొంగింది
గృహిణిగా స్వేద సంద్రమై పారింది
బ్రతుకంతా చాకిరీ చేసి తాను చిక్కిపోయింది
సంసార పంజరంలో అమ్మ చిక్కిపోయింది

# 10. అమ్మ - పేదరికం

1. పక్షి గూటిలో పక్షి పిల్లలకి ప్రతిరోజూ విందు
ప్రభుత్వం వేసిన పేదరికం ముగ్గుమధ్యలో అమ్మ
ఆకలికేడుస్తూ సొమ్మసిల్లేరు తన బిడ్డలు తన కళ్ళ ముందు
కసాయి సమాజమా, అమ్మకి జవాబు చెప్పు ముందు

2. తన వడిలో నెలల బాలుడు జోగుతుండగా
కడుపున మరొకడు పడితే పేదతల్లికి గుండెకోత
ఒక్కడికే చాలీచాలని పాలు
తప్పుకదా పెద్దవాడికిక పస్తులు

3. తలపై కూరల గంపతో మండుటెండలో అమ్మ
ఇలపై బోలెడు బాధలతో బ్రతుకు బాటలో అమ్మ
ధరపై ధరలను తగ్గిస్తూ ప్రజల సేవలో అమ్మ
తనకై తానుగా సొంత కాళ్ళపై నిలబడుతూ అమ్మ

4. సమాజమా! ప్రసవానికి కూడా
అమ్మ కట్టాలా ఆస్పత్రిలో ఫీజులు?
ప్రభుత్వమా! బిడ్డ జననానికి కూడా
పేదతల్లిని డబ్బులడిగేవి ఎలాంటి రోజులు?

5. సారాయి నమ్ముతూ సొమ్ము చేసుకుంటూ
అమ్మ ఆశలన్నీ వమ్ము చేసే ప్రభుత్వం
అమ్మ చేతికి డబ్బులిచ్చి నాన్న చేతినుంచి లాక్కుంటూ
నాన్న గొంతులోనూ అమ్మ బ్రతుకులోనూ పోస్తుంది విషం



6. ధరణిపై ముప్పాళ్ళ వనరులు
ధనవంతుల పాలు
అమ్మా! లేవు కదా వీటిలోన
బిడ్డకు చెందాల్సిన డబ్బాపాలు

7. పసి బుగ్గలపై జాలువారితే కన్నీరు,
తల్లడిల్లిపోయే తల్లులందరినీ చూశారు!
వయసుడిగిన అమ్మ దిగాలుపడితే జగాన, ఆ
అమ్మని అనునయించే కొడుకులెందరిని చూశారు

8. నిరుటి దాకా ఆ అమ్మ లోకానికి రక్షకి
నేటి రోజున వీధి చివరన భిక్షుకి
సిగ్గులేని సమాజమొక వంచకి
గుండెలేని సంతానమొక పాతకి

9. దైవత్వం కలిగి కూడా
వరాలు ఇవ్వలేని దేవుడిలా
మాతృత్వం వుండి కూడా
ఆహారం పెట్టలేని దేవతలా అమ్మ

10. ప్రభుత్వ గోదాముల్లో కుళ్ళిపోయే ధాన్యం
పందికొక్కుల పొట్టల్లో నిండిపోయే ధాన్యం
ఎలుకలకు సాటిరారా నిరుపేద తల్లులు?
అమ్మ ముంగిటిలో కురిపించరాదా ధాన్యపు జల్లులు?

11. గుడిసెలో జోలపాట మోసిన గాలి
మేడలోనూ లాలిపాట మోస్తుంది
అమ్మతనానికి లేవు అంతస్తుల భేదాలు
బిడ్డ పవ్వళిస్తాడు ఏ తల్లి తీసినా కూనిరాగాలు

12. స్వార్థంతో దిక్కుకొక్కడిగ ఎగిరిపోతే బిడ్డలు
వార్ధక్యంతో దిక్కుతోచక మిగిలిపోయే అమ్మలు
ఆశాజీవి అమ్మ కళ్ళల్లో కనిపిస్తే నైరాశ్యం,
వర్ధమాన సమాజమా! ఇంతకంటే లేదు నీకు దౌర్భాగ్యం.

13. నిరుపేద తల్లి గుడిసె చూరులోన
లాంతరులా మిణుకుమనే స్వప్నం
బలవంతుల బుల్‌డోజర్ కాలికింద
అది చిటికెలోన ధ్వంసం

14. తరాలుగా పల్లెలను దోచిన పట్నం
అడవిలో పెట్టింది మెషీనుల రాట్నం
ఖనిజం కోసం తొలిచేస్తే భూములు
నిరాశ్రయులుగా ఆదివాసీ అమ్మలు

15. పనులు దొరకకుంటే అయ్య మదిలో బాధ
కడుపు నిండకుంటే బిడ్డ గొంతులో హోరు
పొయ్యి వెలగకుంటే అమ్మ కళ్ళలో నీరు
నిరుపేదకి తన బ్రతుకంతా ఇలా బేజారు



16. ఆదాయం లేని నాన్న చూడలేదు అమ్మవైపు
సంపాదన పెరిగిన కొడుకు చూపులు భూమిలోకి
కూతురొక్కతే చూడగలదు సూటిగా అమ్మ కళ్ళలోకి
అన్నిచూపులకర్థం తెలిసిన అమ్మ చూపు దేవుడి వైపు

17. రాకున్నా శ్రమకు తగిన ఫలం
పురిటికందుతో సహా కూలిపనికి తరలిన అమ్మ
బిడ్డ కడుపు నింపేందుకు కూడా
దొరలు ఇవ్వరు సరిపడే సమయం

18. నీటిచుక్కలు ఆవిరై ఎంతో పైకెగసిపోతేనే
నీళ్ళమబ్బులు; భూమిపై మళ్ళీ నీటిరాగం
అమ్మలక్కలు, మైళ్ళదూరం నడిచి తెస్తేనే
నీళ్ళ బిందెడు; ఇంట్లో అందరికీ తీరేను దాహం.

19. అతిగా తిని పెరిగిపోయిన నేతల బానపొట్టలు
తిండి లేమితో క్రుంగిపోయిన పేద పసి కడుపులు
అమ్మల కళ్ళముందే పోతుంటే బిడ్డల ప్రాణాలు
పట్టనట్లుగా రోజులు గడిపే ప్రభుత్వాలు

20. నదులకు భారీగా ఆనకట్టలు
కట్టగలదు కానీ ప్రభుత్వం
అమ్మ కన్నీటికి కట్టగలదా ఆనకట్ట
నీట మునిగిన ఇల్లు, కన్నీట మునిగిన అమ్మ

# 11. అమ్మ - సమాజం

1. సూర్యకిరణాలు సోకి
పుష్పించి, ఫలించే వృక్షసముదాయం
అమ్మ చేతిముద్దలు గ్రోలి
జీవించి, చరించే మానవ సమాజం

2. అమ్మ నవ్వులోనే అందరి సంతోషం
ఆమె చేతుల్లోనే బిడ్డలు సురక్షితం
అమ్మ సూచనలతోటే లోకంలో సుపరిపాలన
ఆమె దీవెనలతోనే జగతికి సౌభాగ్యం

3. కోర్కెల కొలిమిలో మనుషులు కాలిపోతుంటే
సంఘంలో మిగిలిన చల్లదనం అమ్మ
మమతలు క్రమంగా ఎండిపోతుంటే
మనుషుల కోసం మిగిలిన చెమ్మదనం అమ్మ

4. అమ్మతనం రాజ్యమేలితే
ఏ పొయ్యిలోనూ పిల్లులుండవు
ఏ వీధిలోనూ, ఏ ఇంటిలోనూ
కడుపునిండని పిల్లలుండరు

5. మతం అమ్మకి వ్యక్తిగతం
అమ్మ మతం మానవత్వం
ఆమె మతం ఆకలికి అన్నం పెట్టడం,
ఏడ్చిన బిడ్డల కన్నీళ్ళను తుడవడం





చిత్రం : శ్రీ సండి

6. చట్టసభల్లో సగం అమ్మల ప్రతినిధ్యం అనివార్యం
ఇక తథ్యం చట్టాల తయారీలో మానవత్వం
మగాడికి తెలిసింది కేవలం నాలుగోవంతు
పిల్లలూ తల్లీ కలిసి బ్రతుకులో మూడొంతులు

7. అందరినీ బ్రతుకమంటూ, బ్రతుకమ్మ పాడుతూ అమ్మలు
అమ్మలని చల్లగా బ్రతుకమని దీవిస్తూ తారలు
బ్రతుకులో కష్టాలతో పోరాడదామంటూ అమ్మలు
కలిసి అందరం బ్రతుకుదామని, బ్రతుకమ్మ పాడుతూ అమ్మలు

8. అమ్మ మాట వింటే ఆర్థికమంత్రి
దిగిరావా ధరలు వదలి దివిని
అమ్మ గోడు వింటే రక్షణమంత్రి
పడవు కదా మిగ్‌లు తృటిలో భువిని

9. వందమంది పురుషులు నిండుసభలో
పలుస్తారా తల్లీ నీ పలుకులు?
నాటి నుంచి నేటి వరకు ఇంకా
దిగజారుతున్న మానవతా విలువలు

10. ఆకాశమంత ప్రేమను దేవుడు
రోదసిలో గోళాలకు పంచినట్లు
భూలోకమంత ప్రేమను అమ్మ
సమాజంలోని బిడ్డలకు పంచితే మేలు



11. పేరంటానికి తరలివెళ్ళే ముత్తయిదువలు
పృథ్వీపైనే నడచే ముగురమ్మల రూపాలు
శ్రావణంలో మేఘాలుంటేనే నింగికి అందం
సమాజంలో అమ్మలుంటేనే అంత సౌభాగ్యం

12. సమాజమా! అమ్మ చుట్టూరా తిరుగవా?
ప్రపంచమా! అమ్మ విలువెంతో ఎరుగవా?
ప్రభుత్వమా! అమ్మ కన్నీటికీ కరుగవా?
జనసముద్రమా! అమ్మ పాదాలను కడుగవా?

13. సోషలిజం, కమ్యూనిజం, నేషనలిజం
ఇజాలన్నీ అమ్మ చుట్టుకున్న చీర, ఆరుగజాలు,
అమ్మకి తెలుసు, బ్రతుకు బాటలోని అన్ని నిజాలు,
అమ్మ సిద్ధాంతం పాటిస్తేనే బాగుపడతయ్ సమాజాలు.

# 12. అమ్మ - యుద్ధం

1. తండ్రులు సామ్రాజ్యాలకై తలపడితే
తల్లడిల్లిపోయేది తల్లులే!
తనయులు తలపొగరుతో కలబడితే
కడుపు కోతలతో మళ్ళీ తల్లులే!

2. ఇది పురుషుల ప్రపంచం, కర్కశుల సమాజం
శాంతిదూత మాట వినని ప్రపంచం
రాజ్యకాంక్షలతో రగిలిపోయే పురుషుల ప్రభుత్వం
ఇది అమ్మ కన్న నిర్దయ పురుషుల ప్రపంచం

3. అక్కడి తమ ఇళ్ళను వీడి, పురుషులు యుద్ధం చేస్తే
ఇక్కడి అమ్మల ఇళ్ళన్నీ నేలమట్టం
కూలిన స్వప్నాల శకలాల మధ్యన
పసికూనలను తమ యెదలలో దాచిన తల్లుల ఆక్రందన

4. యుద్ధరంగాల్లో తండ్రుల వీరవిహారం
శాంతి స్థాపనకై తల్లుల ఆరాటం
యుద్ధాలకు బద్ధ వ్యతిరేకులు తల్లులు
శాంతిని భంగపరచేది తండ్రులు

5. ప్రాణమిచ్చిన తల్లికి ప్రాణమంటే తెలుసు
యుద్ధమంటే విషాదం, అమ్మకి తెలుసు
ఉన్మాదులు పేల్చే ప్రతి తుపాకి తూటా లక్ష్యం
అమ్మ చల్లని గర్భం, కుంకుమ నిండిన అమ్మ లలాటం



6. పేలిన శతఘ్నులు, కాలిన పంటలు
యుద్ధమంటే కాటకం, అమ్మకున్నది ఆ జ్ఞానం
తిండి పెట్టాల్సిన చేతితో మట్టి పొయ్యలేదు
ముద్దు పెట్టాల్సిన వాళ్ళని మట్టి చెయ్యలేదు

7. యుద్ధంలో ఓటమి పొందే పక్షం ఒకటే
మేఘాల్లా వర్షిస్తూ అమ్మ కళ్ళు రెండూ
ఏదో ఒక పక్షంలో పురుషుల విజయోత్సాహం
రెండుపక్కలా వీరమాతల కడుపుశోకం

8. సరిహద్దున శత్రుసైన్యాన్ని అడ్డగిస్తూ
రాలిన అమ్మ నుదుటి కుంకుమ తిలకం
మలిపొద్దున గుండెధైర్యం తెచ్చుకుంటూ
తన కొడుకుని పంపింది వీరమాత రణరంగం

9. స్వదేశంలో పరాయి సైన్యం
సమాజంలో కిరాయి మూకల స్వైర విహారం
దైన్యం పోయి, అమ్మ వదనంలో ధైర్యం
రాజపుత్రిక దూకింది పైనుంచి, కింద అగ్నిగుండం

10. వైభవంగా, రాజసంతో వెలిగిన తల్లి,
అకాలంగా నూరేళ్ళూ నిండిన తల్లి,
తుష్కర మూకల దండయాత్రలో
దూకి చితిలో చేసింది అంతిమయాత్ర.



చిత్రం : శ్రీ నరేందర్



11. రోగాలపాలైన తన భర్తకి
సేవ చేసింది సహధర్మచారిణిలా
బాధ్యతలెరిగి, గద్దెనధిరోహించి
సైన్యాన్ని నడిపింది మహారాణిలా

12. రుద్రమ్మలా మగధీరులను ఓడించి
తానె సింహాసనం సాధించి
రాజ్యాన్ని పాలించి చరిత్రలో
నిలిచింది అమ్మ ఆదర్శమాత

13. గుళ్ళు గోపురాలు కట్టించి
రాజ శాసనాలు చెక్కించి
యుద్ధ రంగాన కదను తొక్కింది
అమ్మ అహల్యాబాయి రాజ్యాలు ఏలింది

14. యుద్ధంలో వెన్నుచూపి
ఇంటికొచ్చిన భర్త ఖడ్గ తిక్కన్నను
వ్యంగాస్త్రాలతో రణభూమికి తరిమింది
వీరమాత ఆమె చానమాంబ

15. కత్తిసాములతో పాటు
అమ్మ విలువిద్య నేర్చింది
కోట బురుజులు నిర్మించి
సైన్యానికి ధైర్యం నూరిపోసింది

16. ఆంగ్ల పాలకులను ఎదిరించి నిలిచింది
భరతమాతకి ముద్దుబిడ్డ వీరమాత
స్వాతంత్ర్య పోరులో సమిధగా మారినా
భావితరాలకు ఆదర్శమై ఝాన్సీలక్ష్మిగా నిలిచింది

17. రాణి చెన్నమ్మగా అమ్మ
చంద్రనిప్పులు చెరిగింది
తలవంచని తల్లి పోరాడుతూ
తాను మనకోసం నేలకొరిగింది

18. బాలచంద్రునికి అమ్మ
వీరతిలకం దిద్దింది
కొడుకు వీరమరణం పొందితే
తాను వీరమాతగా మారింది



# 13. అమ్మ - సైన్సు

1. జననానికి కావలసిన క్రోమోజోములు
రెండూ అమ్మలోనే ఉన్నాయట!
నాన్న లేకుండానే అమ్మ కనగలదట పాపలను
ఇక పురుషులు కారా మరి జోగులు!

2. అండం దానం చేసే మహిళకు
గర్భం ధారణ చేసే మగువకు
పెట్టినా భాషలో దొరికిన ఏదో పేరు
మానవజాతికి అమ్మే తియ్యటి పేరు

3. అమ్మ కడుపులోకి తొంగిచూస్తూ
చెబుతుందట మషీను, లోన కొడుకో కూతురో
కూతురి విలువ తెలియని తండ్రులున్న సమాజం
ఇలాంటి మషీనులను వాడవద్దన్నది ప్రభుత్వం

# 14. అమ్మకి దేవుడి సలహా

1. నేనే పుడతాను నీ కడుపులో నీ బిడ్డగా
వాడు నాలా అవుతాడు నీ చల్లని కరుణలో
నా పేరు పెడతావు నచ్చి నీకు
అట్లాగే పిలువు నీకు శుభము గాను

2. చక్కెర ఎక్కువగా కలిపితే
మిఠాయి వెగటయినట్లు
గారాబం అతిగా చేస్తే అమ్మా!
తల్లీ, నీ కొడుకు దారి తప్పేను!

3. శృతి మించిన కుతూహలం
విషమించే హాలాహలం, అహల్యకు పాషాణం
ఆగంతకులతో, అపరిచితులతో
పరిమితమయిన జవాబులే మేలు

4. మొక్కగానే ఉండగా నీటిలో నీతిని కలిపి త్రాగించు
పసిపాపలకి తిండిలో మంచిని కలిపి తినిపించు
నీ కొడుకు వృక్షమై ఇస్తాడు ఎల్లరికీ చల్లటి ఛాయ
నీ బిడ్డ మేఘమై వర్షించి నింపేను జగమంతా పచ్చదనం

5. ఒక చేయి ఆకలికి అన్నం పెట్టే చేయి
మరొక చేయి తప్పులకి వాడిని శిక్షించే చేయి
ఆకలికి నువ్వు అన్నపూర్ణ, దండనకి ఆదిశక్తి
నీ ఇంటికే కాదు అమ్మా, నువ్వు లోకానికే మాయి



6. ముక్కుపచ్చలారని బిడ్డకు ఎందుకు పెళ్ళి చేస్తావు!
చక్కదనాల చుక్కని సంసారకూపంలో తోస్తావు
ఇది ఆధునికయుగం! ఆడపిల్లకు చదువు ముఖ్యం
అమ్మా! పెళ్ళికంటే ముఖ్యం బిడ్డ జీవితం

7. పొగడకు నీ కొడుకుని పలువురి ఎదుట
తెగడకు నీ బిడ్డను నలుగురి ముందు
పొగడ్తలు అగడ్తలు, వాడు జారిపడతాడు
తిట్లు ములుకులు, బిడ్డ గాయపడుతుంది

8. ఉండవచ్చు బ్రతుకు తీరుపై తారల చూపులు
పడవచ్చు కర్మ బాటపై గతజన్మల నీడలు
చేరవచ్చు నీ బిడ్డకు నీ పుణ్యం, నీ పూజలు
కానీ అమ్మా! పెంపకం కొద్దీ బిడ్డల జీవితాలు

9. పిల్లలకి అతిగా పంచే ప్రేమల్లో కొంత తగ్గించి
అమ్మలు తమ మధ్యలో పంచుకుంటే బాగు
కోడళ్ళు, అత్తమ్మలూ, ఆడపడుచులు
అమ్మలందరి మధ్య సఖ్యత లోకానికే మేలు

10. అమ్మా! ఆకలి తెలిసిన మమకారం నీది
ఏదైనా బిడ్డకు వడ్డించే అధికారం నీది
తిండి కానీ, తిట్లుకానీ, ఏదైనా మంచిదే
కానీ అమ్మా! రెండింటిలో ఒక్కసారి ఒక్కటే వడ్డించు

11. కనిపించేందుకు అందమైన ఇల్లు కాదు
నివసించేందుకు ప్రశాంతత ఉండాలి
ఇల్లంతా రాచరికపు హంగులతో కాక
అమ్మా! ప్రేమలతో ఇంటి అణువణువూ నిండాలి

12. కొడుకు నేరస్థుడయినాసరే ఆకలితో తలుపు తడితే
వాడి కడుపు నింపు తల్లీ ముందుగా
కటకటాల వెనుక నీ స్మృతులతో బ్రతుకుతాడు
మనసు మారి ఒకనాటికి మహాత్ముడవుతాడు

# 15. అమ్మ - పర్యావరణం

1. యుద్ధాలలో శత్రువులనీ, శాంతి సమయాల్లో వృక్షాలనీ
ఎప్పుడూ ఏదో ఒకటి నరికే ప్రయత్నంలో పురుషులు
నరకానికి పోకండి, చెట్లను నరుకకండని తమ బిడ్డలను
పొదివి పట్టినట్లుగా చిప్కోలో చెట్లను వాటేసుకున్న అమ్మలు

2. తన బాటలో తాను పరవళ్ళు త్రొక్కుతూ సాగిపోయే తల్లి
నర్మదపై అత్యాశతో ఆనకట్టలు కట్టే ఆసాములు
వృక్షాలతో బాటు నీటిలో నిండా మునిగిన గిరిజన నివాసాలు
అమ్మ మనస్సు అమ్మకే తెలుసు, నర్మదమాత మనస్సు మేధకే తెలుసు

3. రహదారికి రెండువైపులా నాటి మొక్కలు
తన పిల్లల మాదిరిగా పెంచే తల్లికి వందనం
భవిష్యత్తులో బాటసారుల నీడ కోసం,
అహరహరం పరిశ్రమించే తల్లి సమాజం కోసం

4. పచ్చని చెట్లను కూల్చేస్తాడు పురుషుడు, కాసుల కొరకు
ఎండిన కట్టెలు ఏరుకునే అమ్మలు, వారికది వంటచెరకు
ధనానికి దాసోహమై, అడవిని ఎడారి చేసే మగవారు
ప్రకృతిలో మమేకమై, చెట్లను కాపాడాలనే తపనతో అమ్మలు

# 16. అమ్మ - ఉద్యమం

1. సమాజమే తన స్వగృహంగా భావించి
అర్థులందరినీ తన బిడ్డలుగా ప్రేమించి
చైతన్య గోదారిలా ప్రవహించి మాయమ్మ
ఒక ఉద్యమమై నిలిచింది దుర్గలా మాయమ్మ

2. ఎండకన్నెరుగని తల్లి
భరతమాత సంకెళ్ళు తెంప
సత్యాగ్రహం చేసింది మాయమ్మ
జైలు గోడల మధ్య మగ్గింది మాయమ్మ

3. తగులబెట్టింది నిరసనగా తన
విలువైన విదేశీ వస్త్రాలు
స్వాతంత్ర్య పోరులో చేరింది
తాను ఖద్దరు చీరెలే చుట్టింది మాయమ్మ

4. నైజాము సర్కారుకే
ఎదురు తిరిగింది మాయమ్మ
రాకాసి మూకల కళ్ళలో
కారాలు పోసింది, మిరియాలు నూరింది.

5. తన భర్త పేరున్న సంఘసంస్కర్త
రాజ్యలక్ష్మమ్మ బహుగొప్ప ధీశాలి
బాల వితంతువులకు బొట్టుపెట్టింది మాత
సంఘానికే ఎదురొడ్డి నిలిచింది మహాతల్లి

6. మహిళా సభలు స్థాపించి
వనితలకు విద్యాబుద్ధులు చెప్పించి
తమ బ్రతుకులు తాము బ్రతికేట్లు చేసింది మాయమ్మ
స్త్రీ జాతినే ఉద్ధరించింది దుర్గాబాయమ్మ

7. సంధ్యలోనే జాగృతం మనిషి చైతన్యం
ఉదయారుణ సంధ్య మాయమ్మ
తాను ముందుగా నడిచింది జ్యోతిబాయమ్మ
ప్రగతి పథంలో ప్రజలను నడిపింది

8. పరదాలు తెలుసు, ప్రతిఘటనలు తెలుసు
ప్రణాళికలోని పక్షపాతాలు తెలుసు,
అమ్మది విహంగవీక్షణం, ఆమె ఒక చైతన్య సముద్రం,
అమ్మ ఒక ఉద్యమం, మాయమ్మ నిశ్శబ్ద విప్లవం



చిత్రం : శ్రీ మోహన్

# 17. భరతమాత

1. ఆమె శిరంలో సహస్రారంలో హిమాలయ ఋషిపుంగవ కమలదళం
పైన శివకైలాసవిలాసం, సుందరకాశ్మీర శిఖారవిందం,
కుంకుమాంకిత లలాటం, సనాతన మాత వామభుజంపై
ధవళ కేశ సమూహం, కంఠాన శీతల షిమ్లా మౌక్తికం,
యమునాజల హారం; ఆనందభారతీ నమామ్యహం

2. హృదయం హస్తినాపురం, అరవళీ శ్రేణి దివ్య అలంకారం
మాతకు వింధ్యాచల శ్రేణి సుదృఢ వడ్డాణం
నర్మదా నదీ ఆధ్యాత్మిక ప్రవాహం,
దక్షిణగంగ గోదావరీ ఝరీగమనం, గిరి, జల విహారిణీ,
మాతా సౌందర్య భారతీ నమామ్యహం

3. కృష్ణవేణీ, కావేరీ సుశోభితం, పెరియారులో పాదాభిషేకం
విడివడిన అమ్మ పద మంజీరాలు అరేబియా సాగరంలో లక్షద్వీప సమూహం
అమ్మ సిగ నుండి రాలిన మల్లెలు అండమాను ద్వీపాలు
హిందూ మహాసాగర కెరటాల ముత్యాలు పాదపూజలు చేయగా,
విశాల భారతీ నమామ్యహం

4. రవి తొలికిరణం తాకిన అరుణాచల ప్రదేశం
సప్త సోదరిమణులు తేయాకుల తోటలో పరవశించి,
కామాఖ్యామాతకు ప్రణమిల్లి, బ్రహ్మపుత్రలో స్నానమాచరించి
దక్షిణేశ్వర కాళికామాత చరణాలను ఆ కిరణం తాకగా,
ఉదయ భారతీమాతకు నమామ్యహం



5. గయలో విష్ణువుని సేవించి, వారణాసీపతికి అభిషేకమొనరించి,
గంగా సంగమంలో పునీతమైన రవికిరణం
హరిద్వారంలో బదరికానాథునికి వందనం సమర్పించి,
పవిత్ర సిక్కుగురుద్వారం, థార్ ఎడారులను దాటగా,
విశాల భారతీ నమామ్యహం

6. ఋగ్వేద శ్రవణంలో పరతత్వం దర్శిస్తూ
సామగానంతో దేవతల నృత్యం తిలకిస్తూ
చతుర్వేదాలతో విలసిల్లే ఋషిపీఠం, ఉపనిషత్
సారం తెలిసిన పుణ్యభూమి, గీతాబోధ క్షేత్రమా
ప్రజ్ఞాన భారతీ నమామ్యహం

7. నవధ్యానాలను పండించే కుచేలురూ,
ధ్యానాలనమ్మే దళారీ కుబేరులూ నీ కుమారులే
మరలను నడిపిస్తూ మసిబారిన కార్మికులూ,
ధరలను శాసించే వ్యాపారులూ నీ కుమారులే,
తల్లి భారతీ! ఎందుకీ వ్యత్యాసం!

8. మైదానాల్లో బీటలువారిన బ్రతుకులు వీడే హాలికులూ,
అరణ్యాల్లో మోడువారిన ఆశలతో నిరాశ్రయులైన గిరిజనులూ
నగరాల్లో కాలుష్యం పాలైన శరీరాలతో పురజనులూ
సిరిగల తల్లివి వీరందరూ నీ కుమారులే,
తల్లి భారతీ ఏమిటీ విచిత్రం!



చిత్రం : చిరంజీవి అర్జున్

9. యవనుల కెదురుగ నిలిచిన పురుషోత్తమునీ,
మొగలుల రాచరికం ఒప్పని వీరప్రతాపునీ,
హైందవ రాజ్య సుస్థాపన చేసిన వీరశివాజీనీ
నిస్తేజమైన మాకు, నీ బిడ్డలకు మరొక్కమారు ప్రసాదించు
తల్లి భారతీ!

10. భారత జాతిని మేల్కొల్పిన మహనీయుని వివేకానందునీ
పరతంత్రానికి తలవంచని వీరుని సుభాష్ చంద్రబోసునీ,
తుదివరకూ శాంతి బాటసాగి స్వేచ్ఛ సాధించిన మహాత్మునీ
అశక్తులైన మాకు నీ బిడ్డలకు, మరొక్కమారు ప్రసాదించు
తల్లి భారతీ!



# 18. జగన్మాత

1. అమ్మ ఒక్కటే దిక్కు నాకు
దిక్కులన్నీ తానైన అమ్మ నాకు
ఆమె ఒక్కటే దారి నాకు
విధాతను చేరగలిగే ఆధారమొక్కటే నాకు

2. తాపసులకు సాత్వికంగా దర్శనమిస్తూ
రాజసులకు వైభవంగా వరాలిస్తూ
తామసులను కఠినంగా శిక్షిస్తూ
త్రిగుణాలకు అతీతంగా అమ్మ

3. చెట్టులోన, చేమలోన, కొండలోన
కోనలోన, సెలయేటిలోన
నదిలోన, నదిలో నీటిలోన
తానే రూపుదాల్చింది అమ్మ

4. గుండెవిప్పి పిలిస్తే పలికే దేవత అమ్మ
కనులు మూసి తలిస్తే వెలిగే దీపం నాన్న
అమ్మలోన అణువణువున వెలసింది నాన్న
అమ్మ చెబితేనే తెలిసే రూపం నాన్న

5. జాతి రక్షణ కోసం
ఖడ్గమిచ్చింది తల్లి భవానీ
హైందవ సామ్రాజ్య
సుస్థాపనకై కదం తొక్కిన వీరశివాజీ

6. కనులు మూసి ధ్యానింతునా,
అమ్మ సభలోన నిదురరాని మెలకువ.
కనులు తెరచి చూచి తరింతునా,
ఆమె ఒడిలోన మెలకువరాని నిదుర.

7. సిరికై ప్రార్థించు, అమ్మ హిరణ్మయి
క్షమకై యాచించు, కరుణా కిరణ్మయి
జ్ఞానం సముపార్జించు, ఆమె వేదమయి
మోక్షమర్థించు, అమ్మ ఆనందమయి.

8. కామారితో కాపురం చేయు తల్లి కామాక్షి
ఇల్లులేని వాని ఇల్లాలు, మాత ఇందీవరాక్షి
చెంత చేరరామంటె అతని కంఠాన నాగు
వీలుగా తాను శివుని తనువులో సగమైనది ఆనందభైరవి

9. ఆరు పూవుల మాలతో
పూజించుతు నిన్ను శ్రీమాతను
దీవించి నన్ను హంసగా మార్చి
విహరించనీయవె తల్లి నీ హృదయ గగనాన

10. నిత్య సుమంగళి మాత ముందర
అయ్య సేవించాడు హాలాహలం
అమ్మని చూసి గుటుక పడిపిన గరళం
అయ్యింది అయ్య మెడలో నీలాభరణం

11. మీనాక్షి మమతతో మునిగేటి మనస్సు నాది
దాక్షాయణి దయతో లభించిన తనువు నాది
కామాక్షి కరుణతో కదిలేటి కలము నాది
కాత్యాయని పాదాలను స్పృశించిన కావ్యము నాది

12. తన్మయి కనుల కాంతి కిరణాలు సోకి
నా మనస్సు కొలనున
విరిసిన కమలాలు నా కవితలు
కమలాలనర్పింతు కమలలోచనకు

13. మేఘాల మధ్య మెరిసేటి విద్యుల్లతవు నీవు
జీవాల లోన వెలిగేటి కాంతి నీవు
దృశ్యాల లోని అదృశ్య శక్తి నీవు
వేదాల లోని నిక్షిప్త సారమీవు

14. శబ్దాల లోని భాసించు భావమీవు
ప్రళయాల నాడు ప్రవహించు ధార నీవు
రవిబింబ కేంద్రమై విలసిల్లు సాక్షి నీవు
ముజ్జగాల పాలించు మాత నీవు

15. జఠరాగ్నిని చల్లార్చే అన్నపూర్ణ
క్రోధాగ్నికి వెన్నెల్లా చల్లని తల్లి
బాధాగ్నికి హిమవంతుని దౌహిత్రి
అగ్నులన్నీ అర్పగలిగే శక్తి అమ్మ

21. మెడలోన విషసర్పం, మొలచుట్టూ కరి చర్మం
నెత్తిపై గంగ, నుదుట మూడవ నేత్రం
వాహనంగా వృషభం, వేలవేల గణాల మధ్య
తండ్రి కళ్ళుమూసి ధ్యానిస్తుంటే, అమ్మ నడుపుతుంది సంసారం

22. వృషభం రంకెలు, సర్పం బుసబుసలు,
ఎలుక చంచలత్వం, నెమలి దర్పం,
శివగణాల రణగొణ ధ్వనుల మధ్య
తండ్రి కళ్ళుమూసి ధ్యానిస్తుంటే, అమ్మ నడుపుతుంది సంసారం

23. వేగంగా ఎగిరే కొడుకొక్కడు, మంద్రంగా నడయించే వాడొకడు,
దేవతలు, రాక్షసుల పంచాక్షరీ జపాలు,
మునుల ఘోరతపాలు, అందరికీ అడిగిన వరాలిచ్చి
తండ్రి కళ్ళుమూసి ధ్యానిస్తుంటే, అమ్మ నడుపుతుంది సంసారం



# భూమాత

1. తన తలంపైన నివసించే ప్రాణులన్నీ తన పిల్లలనే
తలంపుతో తన చుట్టే తాను పరిభ్రమించే తల్లి భూగోళం
తమ పిల్లల చుట్టూరా నిత్యం తమ మనస్సులతో
పరిక్రమలు చేసే తల్లులతో నిండిన తల్లి భూగోళం

# గోమాత

1. పుణ్య క్షీర ధారలు ప్రసాదించు మాత
హోమధేనువు భరతావనికి కామధేనువు
తన పంచితమూ పవిత్రమైన పావని
పరమ శాంతమూర్తి, గోమాతకు వందనం

# మేరీమాత

1. సత్యకాముని, శాంతిదూతని, దైవపుత్రుని
కన్న మాత మరియు పుణ్యాత్మురాలు
పాప ప్రక్షాళనకు యేసు ధారపోయగా అసువులు
శిలువ ప్రక్కనే తాను కార్చింది దుఃఖాశ్రువులు

# 19. అమ్మ - దివ్యత్వం

1. అమృతం తోడబుట్టిన అమ్మ
అమ్మతత్వం తెలుసుకున్న తనయులు
అమ్మ రూపం గుండెలో నిలుపుకున్న నరులు
అమ్మ చరణరజం తలపై ధరిస్తే ధన్యులు

2. రోకటికి దేవుడిని కట్టగలిగేది అమ్మ ఒక్కటే
దేవుడికి ఎంగిలి పెట్టగలిగేది ఆమె ఒక్కటే
సూర్యుడిని తన ఆజ్ఞతో ఆడ్డగలిగేది అమ్మ ఒక్కటే
భూతలం స్వర్గంలా మార్చగలిగేది ఆమె ఒక్కటే

3. అమ్మ పూజలు చేస్తే జలంధరుడికే అపజయం లేదు
ఆమె నోములు నోస్తే సామాన్యుడికి ఏ జయం రాదు?
అమ్మ వ్రతాలు చేస్తే ఏ ఇంట ధనం నిండదు?
ఆమె సంకల్పిస్తే ఏ జగతిన శాంతి పండదు?

4. ఉదయ సంధ్యలో భక్తియోగం
అనునిత్యం కర్తవ్యంలో కర్మయోగం
రామాయణ పారాయణం చేస్తూ జ్ఞానయోగం
అమ్మ పుణ్యవతి, సదా దైవంతో ఆమె యోగం

5. మంత్ర బుద్ధులు దైవాలు
మమతకు నిబద్ధులు అమ్మలు
భక్తుల గానానికి కరిగే వేల్పులు
బిడ్డల రాగానికి కరిగే అమ్మలు





చిత్రం : శ్రీ నివాస్

6. త్రిగుణాలూ కలిగిన అమ్మ
అమ్మలా సహజంగా సాత్వికం
గృహిణిలా అవసరంగా రాజసం
దుర్గుణాలను తొలగిస్తూ తామసం

7. గునుకు, తంగేడి మొదలైన పువ్వులను
చెరువుల్లో కలిపితే నీరు పరిశుద్ధమవుతుంది
పసుపు ముద్దను అద్ది తన మంగళసూత్రాలకు
మొక్కుకుంటే అమ్మ, నాన్న ఆయుష్షు పెరుగుతుంది

8. మట్టికుండలో పాలన్నం పొంగించి
అమ్మ తన భక్తిని అందులో రంగరించి
పోతురాజుల నర్తనల నడుమ మైసమ్మ తల్లికి
తీసికెళుతుంది నైవేద్యంగ బోనాలు

9. ముగ్గురమ్మలు కలసి పఠిస్తే
శ్రీ లలితా నామ సహస్రం
స్థిరంగా జగతిలో శాంతి
అనంతం శ్రీమాత కరుణారస ప్రవాహం

10. అమ్మ వదనంలో మహాభావం
అమ్మ శ్రీశ్రీ ఆనందమయి
అమ్మ ఆలింగనంలో మనశ్శాంతి
అమ్మ శ్రీశ్రీ అమృతానందమయి

# 20. నీకోసం అమ్మ

1. రోజంతా శ్రమిస్తూ, ఆ ప్రతిఫలం
రేయంతా శయనిస్తూ, తన స్వప్నం
చీకాకున దాచేస్తూ తన సంతోషం
అమ్మ అలా ధారపోస్తుంది నీకు తన జీవితం

2. అమ్మలా నీకై ఎవరు దుఃఖించగలరు!
ఆమెలా నీ తప్పులు ఎవరు క్షమించగలరు!
అంతలా నీ అల్లరి ఎవరు భరించగలరు!
దేవుడు కాక ఆమె రూపం ఎవరు ధరించగలరు!

3. నీ కోసమే తింటూ అమ్మ
నీకో రూపునిచ్చిన రోజులున్నాయి
నీ కోసమే పస్తులుంటూ తాను
నీకో జన్మనిచ్చిన రోజులున్నాయి

4. నీ కోసమే నిదురపోతూ అమ్మ
నీకై కలలు కన్న రాత్రులున్నాయి
నీ కోసమే నిదురమాని తాను
నీకో నేటినిచ్చిన పగళ్ళున్నాయి

5. నీకై శ్రమించిన తన ఒంటినిండా పగుళ్ళున్నాయి
తన చిర్నవ్వులోనే నీ ఆశల చివుళ్ళున్నాయి
మమతకు మారుపేరైన ఆమె నివసించని ఇళ్ళు ఇళ్ళు కావు
కరుణ తానై రూపుదాల్చిన అమ్మ పాఠం చెప్పని బళ్ళు బళ్ళు కావు

6. నీకై శ్రమించి, శ్రమించి క్రమక్రమంగా
వడలంతా వడలిపోయి అమ్మ
నీకై కృశించి, కృశించి క్రమక్రమంగా
ఎముకలన్నీ కరిగి-కరిగి అమ్మ

7. అమ్మకి తన అలుపెరుగనిచ్చేదెవ్వరు?
అమ్మ అలసట తీరనిచ్చేదెవ్వరు?
నిండుపళ్ళ వృక్షంపై రాయి వేయనిదెవ్వరు?
ఏ కొమ్మకైనా గాయమైతే దాన్ని మాన్పేదెవ్వరు?

8. నిత్యం అన్నం పెట్టే చేయి ఎవరినీ ఆశించదు
వడ్డిస్తూ-వడ్డిస్తూ ఒక్కోసారి ఆమెకేమీ మిగలదు
అన్నపూర్ణలాంటి అమ్మకే సమతుల ఆహార లోపం
ఫలాలనిచ్చే వృక్షానికి నీరుపోయని లోకం!

9. ఇంత సేవ చేసే సభ్యులెవ్వరు కుటుంబంలో
ఇన్ని పనులు చేసే వ్యక్తి ఎవరు సమాజంలో
అమ్మ కంటే కష్టజీవి ఇంకెవరు ప్రపంచంలో
ఆమె కంటే ప్రేమమూర్తి ఎవరు అనంత విశ్వంలో

10. కొలువగలరేమో మానవ సంబంధాలు
పోసి రాసులుగా బంగరు కాసులు
అమ్మ పాలకే వెలలేదు భువిలోన
ఆమెతో బంధానికి మమతలే కోటివేల వరహాలు



11. నీ రోగం తనకిమ్మని ప్రార్థిస్తూ
తన భోగం నీకిమ్మని వేడుకుంటూ
నీ భవితకై తాను కలలు కనే అమ్మ
కళ్ళారా నిను చూస్తూ బ్రతికేసే అమ్మ

12. నశిస్తున్న మానవ మమతానుబంధాలు
మళ్ళీ నిలపాలంటే కావాలి అమ్మ శ్వాస
కృశిస్తున్న నైతిక విలువలన్నీ
మళ్ళీ కాపాడాలంటే అమ్మే చివరి ఆశ

13. తన రక్తం ధారపోసి ఇస్తుంది నీకో జన్మ
తన స్వేచ్ఛని త్యజించి నిలుపుతుంది కాపురం
తన స్వప్నం కరిగించి పోతపోస్తుంది నీ భవితవ్యం
తన సర్వం ధారపోసి తిప్పుతుంది భూగోళం

14. కరుణ నిండిన నిలువెత్తు రూపం
కళ్ళముందు కదులుతుంటే మనకి కన్నీళ్ళెందుకు!
అడగకుండా వరాలిచ్చే మాతృత్వం
మన ఇంట వుంటే మనకి వేరే దేవుళ్ళెందుకు!

15. నీ కలలు సగం పండేసరికి
ఆమె కేశాలు పూర్తిగా పండిపోతాయి
నీ మనసు ఆమెపట్ల ప్రేమతో నిండేసరికి
ఆమెకు ఏళ్ళు నిండిపోతాయి

16. ఎందుకీమె అంత ప్రేమ దాచుకున్నది
ఇన్నాళ్ళూ అంతగా కనిపించనీయక
ఎందుకమ్మ అంత మమత చూపుతున్నది
నిన్ను ఆమెను మరవనీయక!

17. నిజంగా అమ్మకెన్ని గుండెలు?
ఒక్కటి లోపల తన తనువులోనే
పిల్లలొక్కొక్కరూ ఆమె ఒక్కొక్క గుండె అయితే,
అమ్మకి నిజంగా ఎన్ని గుండెలు!

18. అమ్మ ఆలింగనంలో కరిగిన బాల్యం
అమ్మ ప్రోత్సాహంతో జరిగిన విద్యాభ్యాసం
అమ్మ సలహాలతో సాగిన గృహస్థం
అమ్మ దీవెనతో ముగిసిన వార్ధక్యం

19. పండ్ల వంటి పిల్లలను
కాచిన పచ్చని కొమ్మ
కట్టెలా మారి కట్టెలపై
కాలింది చల్లని అమ్మ
(ఓ స్నేహితుడి తల్లి మరణించినప్పుడు వ్రాసింది)

# 21. అమ్మ కోసం నువ్వు

1. దేవతగా చిత్రించి చేసిన పూజలు చాలు
మనిషిగా గుర్తించి ఆమెతో సహకరించు
అమ్మకి తనకంటూ ఓ ఆశ ఉంటుందిగా!
ఆమెకున్న ఆశలన్నీ నెరవేరనీ నీ తోడుగా.

2. ఘోర తపాలతో దైవఋణం, తిలోదకాలతో పితృఋణం
జపాలతో మరోఋణం, మరోఋణం తీరునేమో!
తీరునేమో గొప్ప దక్షిణలతో గురువు ఋణం
తల్లక్రిందులైనా తీర్చగలవా నీ తల్లి ఋణం?

3. నీ ప్రాణం పెట్టినా ఆమెకు పణంగా
ఆమెకొద్దు నీకిచ్చిన ప్రాణమిది తనకై తానుగా
నీ సర్వం ఇవ్వచూపినా నిజంగా ఆమెకొద్దు
అమ్మకివ్వు కొంత ప్రేమ నీకై నీవుగా

4. ఆదాయం అమ్మ దోసిట్లో పోయండి
ఆస్తులన్నీ అమ్మ పేరునే వ్రాయండి
ధాన్యాలన్నీ అమ్మ నట్టింట్లో నింపండి
మాన్యాలన్నీ అమ్మ కనుసన్నల్లో ఉంచండి

5. అమ్మ అడుగుతోనే జాతికి ముందడుగు
అమ్మ ఎదుట రాజు కూడా ఒక బుడుగు
అమ్మ మమత ముందు సముద్రమొక మడుగు
పట్టరా అమ్మకి బంగారు గొడుగు

6. కొంత డబ్బు దాచిపెట్టి అమ్మకోసం నీ లెక్కలో
ఖర్చుపెట్టు కేవలం ఆమెకోసం
కొంత ప్రేమ దాచిపెట్టి ఆమెకోసం నీ గుండెలో
ప్రదర్శించు కేవలం ఆమె సమక్షంలో

7. అమ్మ కోర్కె మేరకు సత్ప్రవర్తన
అమ్మ ఆజ్ఞననుసరించి జ్ఞాన సముపార్జన
చేయవోయీ యువకుడా ఆమెకు మోదంగా
ఉంటుంది నీ భవిత ఇక దివ్యంగా



చిత్రం : శ్రీమతి జె. సునీత



8. నువ్వు తాటి చెట్టంత ఎదిగినా బాలుడా,
నీకు తల్లి ధరణి, నీ వేళ్ళు భూమిలోనే
నీవు పొంగి ఏటిలా ప్రవహించినా బాలికా,
నీళ్ళు పారేది భూమిపైనే, మీ బ్రతుకులు అమ్మతోటే

9. అమ్మ నామం తలచుకో
నీ మనస్సులో భక్తితో నిరంతరం
అమ్మ రూపం నిలుపుకో
నీ గుండెలో పదిలంగా ఆ జీవన పర్యంతం

10. 'అమ్మకి జై' అనే నినాదంతో దిక్కులన్నీ పిక్కటిల్లాలి
'అమ్మలు వర్ధిల్లాలి' అనే సునాదంతో అందరూ ఒక్కటవ్వాలి
అమ్మకి పుట్టిన పిల్లలందరిదీ ఒకే మతం; పసితనం,
సరిహద్దులు చేరిపేసి బ్రతికితే మానవసమాజం, అమ్మకి ప్రమోదం

# అమ్మ

అమ్మ మెడలో కవితల హారం

కె. వేంకటరామకృష్ణ




ప్రపంచంలోని పద సంపదనంతా
రాసిపోసి చూస్తే
అమ్మంత బరువైనదీ...
అమ్మంత తేలికైనదీ లేదు!
ఆర్ద్రతతో బరువెక్కేదీ...
స్మరణ మాత్రం చేత మనస్సుని తేలిక చేసేదీ...
అంతటి అమృతమయమైన మాట... అమ్మ!!
అమ్మని ఎప్పుడు తల్చుకున్నా హాయిగానే
ఉన్నప్పుడు...

అమ్మనే అనవరతం తల్చుకుంటూ పరవశించి...
కలం పట్టుకుంటే... ఆత్మీయతా క్షీరం ఉప్పొంగి
ఇదిగో ఇలా కవితల రూపంలో...
హనుమంతుడి రోమ రోమంలో
రామనామం ఉన్నట్టు...
రామకృష్ణ ప్రతి వాక్యంలోనూ అమ్మ సాక్షాత్కరించి...
ప్రతుల్ని శ్రీ చక్రాలుగానూ...
పుస్తకాన్ని 'సౌందర్యలహరి'గానూ మార్చేసింది.
ముచ్చటపడ్డ 'అమ్మలగన్న అమ్మ'
ఆశీస్సులందిస్తుంది!!

తనికెళ్ల భరణి

